# పీ ఠి క

భారతవర్షమునందలి మహాకవులలోఁ బ్రధానస్థానము నందియున్న కవిసార్వభౌముఁడగు కాళిదాసునియభిజ్ఞానశాకుంతలనాటకము సంస్కృతనాటకములన్నిటిలోనను సర్వోత్కృష్ట మైయున్నది. ఇది యీనాటకముననుసరించియే వ్రాయఁబడినది గాని దానిగుణగౌరవములు దీనినిబట్టియే తెలిసికొనవచ్చునని మాత్రము పాఠకులు భ్రమపడఁగూడదు. నాటకముం జదివినవారు దీనినిగూడఁ జదివినచోఁ సీరెంటియంతరమును బోధపడఁగలదు. నాటకముం జదువనివారికిఁ దేటతెల్లముగ నందలి యితివృత్తముం దెలుప వలయునను నుద్దేశమే యీగ్రంథలేఖనమునకు ముఖ్యకారణము. ఈగ్రంథముం జదివిన యుత్సాహముతో మాపాఠకులు శ్రీకాళిదాసుని నాటకమును విని యందలి రసభావముల నిందుఁ జేర్పలేకపోయితి మని మమ్మునిందించినను మేముకృతార్థులమే యగుదుము ! అప్పుడే మాపరిశ్రమ సార్థకమగును. పాఠకులారా ! ఈశకుంతలనుబట్టి కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలమునందలి గుణగౌరవోత్కర్షలను నిర్ణయింప వలదని మిమ్ముఁ బ్రార్థించుచున్నారము.

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,
పిఠాపురము. } వేంకటపార్వతీశ్వరకవులు.

శ్రీరామచంద్ర.

# శకుంతల.

## ప్రథమాంకము.

### ప్రథమదృశ్యము — తపోవనపథము.

పూర్వకాలమున భారతవర్షమున దుష్యంతుఁడను నొక సార్వభౌముఁడుండెను. అతఁ డొకప్పుడు సపరివారముగ వేఁటకుఁ బోయెను. ఒకనాఁడాతఁడు వనమధ్యమున మృగాన్వేషియై పరిభ్రమించుచు నొకలేఁడిపిల్లం గాంచి దానిని లక్ష్యముచేసి వింట బాణమును సంధించెను. ఆలేఁడిపిల్ల రాజోద్దేశమును గ్రహించి చెంగుచెంగున దాఁటుచుఁ బ్రాణభయముచేఁ బరుగెత్తనారంభించెను. అప్పుడు రథారూఢుఁడగు రాజు తనసారథిం జూచి యతివేగముగ నాలేఁడి ననుసరించి రథమును బరుగెత్తింప నాజ్ఞాపించెను. సారథి చబుకుతో గుఱ్ఱముల నదలించుచు వాయువేగమున నడపించుచుండెను.

నిమిషములో రథ మాహరిణమును సమీపించెను. రాజు బాణమును వదలుటకు సిద్ధముగా నుండెను. ఇంతలో దూరము నుండి యిరువురుమునులు దృఢస్వరముతో "మహారాజా! ఈయాశ్రమమృగమును జంపవలదు! చంపవలదు!" అని వారించిరి. సారథి మాటిమాటికి లాగించి "సార్వభౌమా! ఇరు

పురుతపస్వు లీమృగమును జంపవలదని నిషేధించుచున్నారు. అని చెప్పెను. తపస్వి యనుమాట విన్నతోడనే రాజదరిపడి “ సత్వరము గుఱ్ఱములపగ్గముల బిగఁబట్టి రథవేగము నుపసంహరింపుము ” అని సారథి కాజ్ఞాపించెను. సారథియు రాజాజ్ఞను దలఁ దాల్చి యట్లే చేసెను.

ఇంతలో మునులు రథమును సమీపించి “ రాజా! ఇది యాశ్రమమృగము. దీనిని జంపఁగూడదు. వజ్రకర్కశంబును దీక్ష్ణముఖంబును, నగునీబాణ మీయల్పప్రాణిపైఁ బ్రయోగింపఁ దగినది కాదు. నీ శరాసనమునుండి యీ బాణము నుపసంహరింపుము. నీ శస్త్రము దీనుల రక్షించుకొఱకుఁగాని శిక్షించుకొఱకుఁ గాదు. ” అని పలికిరి.

రాజు లజ్జితుఁడై బాణము నుపసంహరించి మునులకు నమస్కరించెను. ఆమునులు చేతులెత్తి దీర్ఘాయుష్మంతుఁడవు కమ్మని యాతని నాశీర్వదించి “ మహారాజా! ఉత్తమవంశజుఁడవైన నీ కీవినయము యోగ్యమైనదియే. నీవు సత్పుత్రవంతుఁడవయ్యెదవుగాక ! ఆకుమారుఁ డీసమస్తపృథ్వీతలమునకు నేకచ్ఛత్రాధిపతి యగునుగాక. ” అని దీవించిరి. రాజు వారికిఁ బ్రణమిల్లి “ బ్రాహ్మణాశీర్వాదమును శిరసావహించితిని ” అని వినయముతోఁ బలికెను.

తరువాత నాతపస్వులు “మహారాజా! ఈమాలినీనదీ తీరమున మనోహరమగు కణ్వమహర్షి యాశ్రమమున్నది. మీ

రాజకార్యముల కెట్టియభ్యంతరమును లేకున్నచో మీరాశ్రమమునకుం బోయి యతిథిసత్కారము నంగీకరింపవలయును. మఱియు మీ భుజబలముచే సంరక్షింపఁబడుచున్న యీభూమండలమునఁ దపస్వుల ధర్మానుష్ఠానము లెట్లు నిరంతరాయముగఁ గొనసాగుచున్నవో పరీక్షింపవచ్చును.'' అనుటయు రాజు "మహర్షి యాశ్రమమునం దున్నాఁడా'' అనిప్రశ్నించెను. "లేఁడు, మహారాజా! ఆతఁడు తన తనయయగు శకుంతల నతిథిసత్కారమునకు నియోగించి యామె ప్రతికూలగ్రహస్థితిని శాంతింపఁ జేయుకొఱకు సోమతీర్థమునకుఁ బోయియున్నాఁడు'' అని మునులు చెప్పిరి. "మహర్షి యాశ్రమమున లేనంతమాత్రమున నిబ్బంది యేమియును లేదు. నేనిప్పుడేపోయి తపోవనమును దర్శించి నాయాత్మను బవిత్రముగఁ జేసికొందును.'' అని మహారాజనుటయు మునులు సెలవుగైకొని యటనుండి వెడలిపోయిరి.

అప్పుడు రాజు సారథిం జూచి "సూతా! రథము వేగముగ నడపింపుము! తపోవనమును దర్శించి యాత్మను బవిత్రము చేసికొనవలయును'' అనియెను. సారథి మరల గుఱ్ఱములను బరుగెత్తించెను. కొంతదవ్వు చనినంతనే రాజు తనదృష్టుల నటునిటుఁ బరగించి "సూతా! ఎవ్వరును జెప్పకుండఁగనే యిది తపోవనమని తెలియుచున్నది సుమా! ఇటుచూడుము! తొఱ్ఱలయందున్న చిలుకముక్కులనుండి జాఱిపడిన నివ్వరిధాన్యము చెట్లక్రింద నంతట నలమికొనియున్నవి. తపసులు గారకాయలఁ జదుకఁ

గొట్టిన శిలాఖండములపై నూనెమెఱుఁగు లెట్లున్నవియో చూడుము! ఈపచ్చనికుశభూమియందు నిర్భయముగా లేఁడిపిల్లలు గంతులువైచుచు నాడుకొనుచున్నవి. ఇచ్చటి చెట్లయందలి చిగురుటాకు లన్నియును యజ్ఞధూమములచే మలినీకృతమై యున్నవి." అని యాశ్చర్యముతో ననియెను. సారథి "మహారాజా! నిజముగా మీరు సెలవిచ్చినట్లే యున్నది." అనియెను.

ఇట్లు కొంతదూర మరిగినతరువాత రాజు "సూతా! ఆశ్రమమున సందడి కల్పించి శాంతిభంగముగావించుట యుచితము గాదు. ఇచ్చట రథము నాఁపుము. నేను దిగియెదను." అనియెను. సారథి యట్లే రథము నాఁపెను. రాజు రథావతరణముం గావించి తన్నుఁదాఁ జూచుకొని "సూతా! తపోవనమునకు వినీతవేషులై పోవలయును. ఈ ధనుర్బాణములను, సీ రాజాలంకారములను నీయొద్ద నుండనిమ్ము" అని వానినాతని కిచ్చి "ఈగుఱ్ఱములు చాల నలసియున్నవి. నేనాశ్రమవాసులను సందర్శించి వచ్చువఱకును నీవీగుఱ్ఱములను సేదదేర్చుచుండుము" అని యాజ్ఞాపించి తానాతపోవనమునఁ బ్రవేశించెను.



# ద్వితీయదృశ్యము.

## తపోవనము.

తపోవనమునఁ బ్రవేశించినంతనే దుష్యంతునకు దక్షిణాభుజస్పందన మయ్యెను. వివాహమును సూచించునట్టి లక్షణము తపోవనమునం దోఁచుటచే మహారాజు విస్మితుఁడై తనలో ,, శాంతరసాస్పదంబగు నియ్యాశ్రమమున నాదక్షిణబాహు వదరుచున్నది. ఇట్టి ప్రదేశమున మావంటివారి కీశుభసూచనమునకుఁ దగినఫలము లభియించు ననుకొనుట కవకాశ మెక్కడిది ? కాదుకాదు. భవితవ్య మెచ్చటనైనను జరిగితీర వలయునుగదా ! ” అని యీవిధముగ నాతఁ డాందోళితహృదయుఁ డగుచున్న సమయమున ,, ప్రియసఖి ! ఇటు ! ఇటు ! ” అను పలుకు లాతనికిఁ గర్ణగోచరము లయ్యెను. రా జాతల్కాలించి ,, ఈవృక్షవాటికాదక్షిణభాగమునుండి రమణీ మధురాలాపములు వినవచ్చుచున్నవి. సంగతి యేమో తెలిసికొన వలయును. ” అని భావించుకొనియెను.

తరువాత దుష్యంతుఁ డించుక పరిక్రమించి సమవయస్కలగు ముగ్గురు తపస్వికన్యకలం గాంచెను. ఆముగ్గురును గక్షముల జలకలశములుంచుకొని పూలచెట్లకు నీరు పోయుటకై వచ్చుచుండిరి. రాజు వారిసౌందర్యమాధుర్యమున కబ్బురపడి ,, వీ రాశ్రమవాసిను లగు మునికన్యకలు; అయినను వీరి

వంటిసౌందర్యవతులు మాయంతఃపురమునఁ గూడ లేరు. ఔను. వనలతలయెదుట నుద్యానలతాసౌందర్య మెంతపాటిది ?" అనుకొనుచు నాతఁ డొకచెట్టుచాటున నిలిచి వారివంకనే యాశ్చర్యముతోఁ జూచుచుండెను.

అప్పుడు శకుంతల యనసూయాప్రియంవద లను నిరువురు చెలులతోఁ గలసి వచ్చి వృక్షవాటికం బ్రవేశించి పాదులయందు నీరుపోయుట కారంభించెను. అంత ననసూయ శకుంతలం జూచి పరిహాసముగా "సఖీ! తండ్రియగు కణ్వమహర్షికి నీకంటెను నీయాశ్రమవృక్షములే ప్రేమపాత్రములనుకొనియెదను. కానున్నచో నవమాలికాకుసుమకోమలివగు నీచే నీచెట్లకేల నీరు పోయించును ?" అనియెను. శకుంతల మందహాసముచేయుచు "సఖీ! అనసూయా! కేవలమును దండ్రియాజ్ఞ యయ్యెనని మాత్రమే నేనీచెట్లకు నీరు పోయుటలేదు. నాకుఁగూడ వీనిపై సోదరస్నేహ మున్నది ! అనియెను. అప్పుడు ప్రియంవద "సఖీ ! శకుంతలా ! గ్రీష్మకాలమునఁ బుష్పించు వృక్షములకు జలసేచనము పూర్తియైనది. ఇఁకఁ బూతకాలము గతించినతరులతల నభిషేకింతము రమ్ము." అనియెను. తరువాత ముప్పురును గలసి సకలవృక్షములకును జలప్రదానముం గావింపఁ దొడంగిరి.

దుష్యంతుఁ డన్నిమాటలను వినుచు సంతయుం దిలకించుచు నాశ్చర్యముతోఁ దనలో "ఈమెయేనా క[illegible]య

యగు శకుంతల ? ఇట్టిసుందరమూర్తిని వల్కలములచే నలంక రించుటచేఁ గేవలమును గణ్వమహర్షి యవివేకునివలె నగప డుచున్నాఁడు. అయినను బ్రఫుల్లకమలము శైవాలసంయోగముచే విలక్షణశోభావంతమైనట్లు, పరిపూర్ణచంద్రమండలము కళంకసంపర్కముచే మఱింత ప్రకాశమానమైనట్లు సర్వాంగ సుందరి యగు నీమె వల్కలధారిణియయ్యును ద్రిభువనమనో మోహినియై యున్నది. స్వభావసుందర మగు మోహనమూర్తి కలంకారములతోఁ బని యేమున్నది ? ” అని భావించుకొను చుండెను.

శకుంతల జలసేచనముం గావించుచు నెదుటనున్న సఖిం గాంచి ‹‹ సఖీ ! సమీరభారముచే సంచలించుచున్న నవపల్లవ ములుగల సహకారతరువు తనయంగుళీనిర్దేశముచే నన్నుఁ బిలు చుచున్నట్లున్నది. కావున నేనటకుఁ బోయెదను. ” అని చెప్పుచు నామె సహకారతరుసమీపమునకుఁ బోయి నిలువఁబడియెను.

అప్పుడు పరిహాసప్రియ యగు ప్రియంవద ‹‹ సఖీ ! మఱి కొంచెముసేపు నీవచ్చోటనే యుండుము ! ” అనియెను.

శకుం.—ఎందులకు సఖీ ?

ప్రియం.—నీవు సమీపమందుండుటచే సహకారభూ రుహమిప్పు డతిముక్తలతతోఁ గలిసికొన్నట్లున్నది !

శకుంతల మందహాసము చేయుచు ‹‹ సఖీ ! ఇందులకే కాబోలు నీవు ప్రియంవద వైతివి ? ” అనియెను.

ప్రియంవద పరిహాసమునకు రాజు మిగుల నానందించెను. "ప్రియంవద సత్యమే చెప్పినది. కాకేమి? ఈశకుంతల యధరమున నవపల్లవరాగ మున్నది; బాహుయుగళమునఁ గోమల లతాశోభయున్నది; ఇఁక నీమె నవయౌవనము వికచకుసుమ రాశివలె సర్వాంగవ్యాప్తమై యున్నది. ఆసహకారమునొద్ద శకుంతల యవిముక్తలతవలె నున్నదనుటలో వింత యేమున్నది?" అని దుష్యంతుఁ డనుకొనియెను.

అప్పు డనసూయ "శకుంతలా! చూడుము! చూడుము! నీవు వనతోషిణియని పేరుపెట్టిన నవమాలికాలత యిప్పుడు సహకారభూరుహమునకు స్వయంవర వధువైనది!" అనెను.

శకుంతల యామాట విని వనతోషిణిని సమీపించి హర్షచిత్తముతో "చెలీ! అనసూయా! ఈరెంటికి నిప్పు డెట్టి యదృష్టము పట్టినది! నవమాలిక వికసితనవకుసుమశోభినియై యున్నది; సహకారము ఫలభారావనతమై యున్నది!" అనియెను.

ఇరువురు నిట్లు సంభాషించుకొనుచుండఁగాఁ బ్రియంవద చిఱునవ్వుతో "అనసూయా! మనశకుంతల నిరంతరము నీవనతోషిణి నింతయుత్సాహముతో నేల చూచుచుండునో నీకుఁ దెలిసినదా?" అనియెను.

అన — తెలిసినది. ఈవనతోషిణివలెనే తానును దన కను

మహానుభావుని బడయవలయు ననుకోరికతో నట్లు చూచుచుంటి ననుకొనుచున్నాను.

శకుం.—కాదు కాదు. ఇది నీమనసులోనిమాట.

అని పల్కి శకుంతల సమీపమునందున్న మాధవీలతం జేరి ప్రియంవదం జూచి "సఖీ! నీకొకమంచివార్త చెప్పెదను. ఈమాధవీలత యామూలాగ్రముగ మొగ్గదొడిగినది సుమా" అనియెను.

ప్రియం.—చెలీ! నేనును నీకు శుభవార్త చెప్పెదను. నీకుఁ ద్వరలోనే పెండ్లియగును.

శకుంతల యించుకకపటకోపమును నటించుచు "చెలీ! నీమాట లెప్పుడు నిట్లే యుండును. నాతో మాటాడకుము!" అనియెను.

ప్రియం.—కాదు చెలీ! నేను హాస్యమాడుట లేదు. ఈ మాధవీలత మొగ్గదొడుగుటయే నీవివాహసూచక మని తండ్రి యగు కణ్వమహర్షి చెప్పియున్నాఁడు.

ఇరువురు నిట్లు మాటలాడుకొనుచుండఁగా ననసూయ నవ్వుచు "ప్రియంవదా! శకుంతల యా మాధవీలత నింతయాదరముతోఁ బెంచుచుఁ బ్రేమపూర్వకముగఁ జూచుకొనుచుండుట యిందుకొఱకా?" అనియెను.

శకు.—కాదు. కాదు! ఈమాధవీలత నాసోదరి. కావు

సనే నేను దీనిని నీరుపోసి పెంచుకొనుచున్నాను; ప్రేమతోఁ జూచుకొనుచున్నాను.

అని చెప్పుచు శకుంతల యాలతకు నీరు పోయుచుండెను. అప్పుడే వికసించిన యొక మాధవీముకుళమునందలి తేనె ద్రాగుచున్న మధుకర మొకటి యాజలసేచనమునకు బెదరి యాంమొగ్గను వదలి వికచకమలభ్రాంతిచే శకుంతలవదనమున వ్రాలుట కుపక్రమించెను. శకుంతల తనకరపల్లవచాలనమున దానిని వారింపఁజూచెను గాని దుర్వృత్తమగు నామధుకరము జుమ్మని రొదచేయుచుఁ బరిభ్రమింపఁదొడంగెను. అప్పుడు శకుంతల యధీరయై "సఖీ! రక్షింపుము! ఈపోగరుబోతు తుమ్మెద నన్ను వ్యాకులపెట్టుచున్నది" అనియెను.

అనసూయాప్రియంవదలు నవ్వుచు "ప్రియసఖీ! రక్షించుటకు మాకు సామర్థ్య మెక్కడిది? రక్షించువాఁడు దుష్యంతుఁడు! రాజగు దుష్యంతుని స్మరింపుము! తపోవనరక్షణభార మంతయు దుష్యంతునిది!" అని పరిహాసించిరి.

శకుంతల విసుఁగు ననుభవించుచు ఈమదభ్రమరము నన్ను నిలువనిచ్చుటలేదు. నేనిచ్చటనుండఁజాలను." అని నాలుగడుగులు వెనుకకువైచి ,,ఇదియేమి? ఇది నన్నే వెంబడించుచున్నది. చెలులారా! రక్షింపుఁడు" అని మరల వేఁడుకొనియెను.

మరల వారిరువురును ,,చెలీ! మేమేమిచేయఁగలము?

దుష్యంతుని బిలువుము! ఆతఁడే నిన్ను రక్షింపఁగలఁడు" అని పలికెరి.

అంతయునుజూచుచు వినుచున్న దుష్యంతుఁడు తనలో "వీరియెదుటఁబడుట కిదియే మంచిసమయము. కానిరాజుగా వీరికంటఁబడుట నాకిష్టము లేదు. అతిథివలెఁ బోయి యీయామె కభయప్రదానముం గావించెదను." అని నిశ్చయించుకొని యతి త్వరితముగ నెదుటకుఁబోయి "పురువంశోద్భవుఁ డగుదుష్యం తుఁడు దుష్టులను శాసించుచుండఁగా ముగ్ధలగు తపస్వికన్యకల యెడల నత్యాచారములం గావించుట కెవ్వనికి సాధ్యమగును?" అనియెను.

అపరిచితుఁ డగు నొకపురుషుఁ డాకస్మికముగ నగపడు టచే మొట్టమొదట నామువ్వురుకన్యకలును గూడ నించుకసం కోచించిరి. తరువాతఁ గొంతసేపటికి ననసూయ "అయ్యా! ఏమి యును లేదు. ఎట్టి యనిష్టమును గలుగలేదు. ఒక దుష్టమధు కరము మాప్రియసఖియగు శకుంతలను వ్యాకులపఱిచినది. అం దుచే నామె బెదరిపోయినది" అనియెను.

రాజు మందహాసము చేయుచు శకుంతలం జూచి "తపోధ ర్మములు నిర్విఘ్నముగఁ గొనసాగుచున్నవా?" అని ప్రశ్నించెను.

శకుంతల లజ్జాకుంచితయై తలవంచుకొని చిత్రప్రతిమ వలె నిలువఁబడిపోయెను; ప్రత్యుత్తరము చెప్పఁజాలకపోయెను. అప్పు డనసూయ "మహాత్మా! తపస్సు వర్ధిల్లుచున్నది. ఈసమా

యమున మీవంటి యతిథుల సమాగమమువలన మఱియు వర్ధిల్లుచున్నది." అనియెను.

అంతటఁ బ్రియంవద శకుంతల నుద్దేశించి "చెలీ! నీవు శీఘ్రముగఁబోయి కుటీరమునుండి యర్ఘ్యపాత్రముం గొని తెమ్ము. జల మక్కఱలేదు. ఈజలకలశమునందలి జల మాతని పాదప్రక్షాళనమునకుఁ జాలును." అనియెను.

రాజు—వలదు. వలదు. ఆయాసమక్కఱలేదు. మీ మధురసంభాషణమువలననే యాతిథ్యము సంపన్నమైనది.

అన—అయ్యా! అట్లయినచో నీకదళీవేదికపైఁ గూర్చుండి మార్గాయాసమును దీర్చుకొనుఁడు.

రాజు—చెట్లకు నీరుపోసి మీరు చాల నలసి యుంటిరి. కొంచెమునేపు విశ్రమింపుఁడు.

ప్రియం—చెలీ! శకుంతలా! అతిథియానతిని బాలింపవలయును. అందఱమును గూర్చుందము రమ్ము!

ఈవిధముగా నందఱును గూర్చుండిరి. అప్పుడు శకుంతల తనలో "ఏమిటి? ఈ మహాపురుషునిఁ జూచినతోడనే నాహృదయమునఁ దపోవనవిరుద్ధంబగు నేదియో తెలియఁబడని భావముదయించుచున్నదేమి?" అని యనుకొనుచు నాతనివృత్తాంతమంతయును వినవలయునని వేడుకపడుచుండెను.

అప్పుడు రాజా కన్యకలవంకఁ జూచుచు "మీరు మువ్వురును సమానరూపవతులు; సమవయస్కులు; సమానకార్య

నిగూక్తులు. ఇందుచే మీస్నేహభావము మిగుల రమణీయము గా నున్నది.'' అనియెను.

ప్రియంవద రాజునకుఁ దెలియకుండ ననసూయం జూచి ,,సఖీ! ఈపురుషోత్తముఁ డెవ్వరే? ఎంతటిచతురుఁడు! ఎంతటి గంభీరపరిశ్రుతి! ఎంతటి ప్రియభాషాశీలుఁడు! ఈతని మధురభాష ణములవలనఁ జిరపరిచితంబగు స్నేహభావ ముదయించుచున్న ది!" అనియెను.

అన—సఖీ! నాకుఁగూడ నట్లె తోఁచుచున్నది. మం చిది. అడిగి తెలిసికొనియెదను.

అని రాజుంగాంచి ,,ఆర్యా! మీమధురాలాపముల నాలకింపవలయునని నాశతోఁ బ్రశ్నించుచున్నదానను. మీ జన్మముచే నేరాజవంశ మలంకరింపఁబడినది? ఏదేశమున కిప్పుడు మీవియోగము దుస్సహమైయున్నది? ఈసుకుమారశరీర మేం నిమిత్త మీతపోవనగమనాయాసమును స్వీకరించినది?'' అని ప్రశ్నించెను.

ఆమాటల నాలకించి శకుంతల తనహృదయమును బ్రి బోధించుకొనుచు ,,హృదయమా! ఏల యాయాసపడియెదవు? నీవు దేనినిగూర్చి వినుటకై తొందరపడుచుంటివో దానిని గూర్చియే యనసూయ ప్రశ్నించుచున్నది. శాంతింపుము''అని చెప్పుకొనియెను.

రాజు తనలో ,,ఇప్పుడు నేనేవిధముగా నాత్మపరిచయ

ముం గావించుకొందును? సత్యము చెప్పినచో నంతయు వెల్లడి యైపోవును'' అని యాలోచించుకొని ,,మహర్షికన్యకలారా! నే నీరాజ్యమున ధర్మాధికారిని. పుణ్యాశ్రమసందర్శనాభిలాషచే నీతపోవనమునకు వచ్చితిని'' అనియెను.

అన—ఆర్యా! తపోవనవాస్తవ్యుల కిది పరమసౌభాగ్యము. మీవంటివారువచ్చి పరమపరితోషలాభముం గల్పించితిరి.

ఇట్లు సంభాషణము జరుగుచుండఁగాఁ బరస్పరసందర్శనమువలన రాజునకును శకుంతలకును హృదయములు చలించి వారిహృదయభావములు వారియాకృతివిలాసములయందు విస్పష్టము లగుచుండెను. అనసూయాప్రియంవద లాయిరువురిభావములను గ్రహించి రాజునకుఁ దెలియకుండ శకుంతలం గాంచి ,, సఖి ! మహర్షియగు తండ్రిగారిప్పు డాశ్రమమునందే యున్నచోఁ దనజీవన సర్వస్వమునైన నొసంగి సంతోషపెట్టి యుందురుగదా ! '' అని పలికిరి.

శకుంతల కృత్రిమకోపమును నటించుచు ,,మీరేదియో మనసునఁ బెట్టుకొని మాటలాడుచున్నారు. నేను మీమాటల నాలకింపను '' అనియెను.

దుష్యంతుఁడు శకుంతల వృత్తాంతమును సవిశేషముగ నాలకింపవలయునను నుత్సాహముతో ననసూయాప్రియంవదల నుద్దేశించి ,, నేను మీసఖివిషయమునఁ గొన్నిసంగతులఁ దెలిసికొనవలయు నని కోరుచున్నాను '' అనియెను.

అనసూయా మా ప్రియంవదలు " అయ్యా! మీ రిట్లు కోరుట మమ్మనుగ్రహించినట్లే—నిస్సంకోచముగ మీ యిష్టము వచ్చిన సంగతి నడుగవచ్చును. " అని పలికిరి.

రాజు—మహర్షి యగు కణ్వుఁడు కుమారబ్రహ్మచారి; ధర్మచింతనమునందు బ్రహ్మోపాసనమునందు నేకాంతనిరతుఁడు; ఆతఁ డెన్నఁడును దారపరిగ్రహణము చేయలేదు. అట్టిచో నాత నికి మీసఖి యెట్లు తనయ యయ్యెనో నాకు బోధపడుట లేదు.

అన—మహాత్మా! మా ప్రియసఖ జన్మవృత్తాంతము మేము వినినది వినినట్లు చెప్పెదము వినుము:—అతి ప్రభావశా లియగు విశ్వామిత్రుఁ డనురాజర్షింగూర్చి మీరు వినియే యుం దురు. ఆతఁ డొకప్పుడు గోమతీతీరమున నతికఠినంబగు తపస్సు చేసికొనుచుండఁగా దేవతలు భయపడి యామహర్షి సమాధిభం గముం గావింపఁగోరి మేనక యనునప్సరస నచ్చోటికిం బంపించిరి. మేనక విశ్వామిత్రుని యాశ్రమమునకు వచ్చి మాయాజాల ములను బన్నుటచే నారాజర్షికి సమాధిభంగ మయ్యెను. మాస ఖిమణికి మేనకావిశ్వామిత్రులే జననీజనకులైరి. తరువాత నిర్ద యురాలగు మేనక యప్పుడే ప్రసవించిన తనయయగుమాశకుం తల నరణ్యముననే విడిచి స్వస్థానమునకు వెడలిపోయినది. దిక్కు మాలి యరణ్యమున నొంటిగఁ బడియున్న యాబిడ్డ నొకపక్షి యనిర్వచనీయ స్నేహభావముసఁ బక్షములచే నాచ్ఛాదించి రక్షించెను. ఇట్లుండ దైవయోగముచే మహర్షి యగుకణ్వుల

హా రాసమయమునకే యచ్చోటికిం బోవుట తటస్థించెను. ఆమ హాత్ముండు సద్యఃప్రసూతయగు బాలక నట్టి యవస్థలోంగాంచి కరుణార్ద్రహృదయుండై పోయెను. అతం డాబాలికను తత్క్షణమే తనయాశ్రమమునకుం గొనితెచ్చి తనకన్న బిడ్డవలెనే లాలనపాలనములం గావింప నారంభించెను. ప్రథమమునం దీబాలిక శకుంతలాలితయగుటచే నీమెకు శకుంతల యని యామహర్షియే నామకరణముం గావించెను.

రాజు—ఆలాగా! కాకున్నచో మానవులలో నిట్టి యలౌకిక రూప లావణ్యము లెక్కడివి? జ్యోతిర్మయంబగు విద్యుల్లేఖ భూతలమున నుదయించు టెట్లు?

శకుంతల లజ్జావనతవదన యయ్యెను. ప్రియంవద చిఱునవ్వుతో శకుంతలవంకం జూచుచు రాజు నుద్దేశించి „అయ్యా! మీముఖవిలాసముంబట్టి చూడంగా నింకను మీ రేదియో ప్రశ్నింపందలంచినట్లు తోంచుచున్నది.” అనియెను.

శకుంతల రాజున కగపడకుండం బ్రియంవదను వ్రేలితో బెదరించుచుండెను. అప్పుడు రాజు „ప్రియంవదా! ఈవృత్తాంత శ్రవణమున నాకు విలక్షణంబగు నానందానుభవమగుచున్నది. మీసఖింగూర్చి యింకొక్కసంగతి మాత్రము తెలిసికొనవలసి యున్నది” అనియెను.

ప్రియం—మీ రేల సందేహించెదరు? నిస్సంశయముగా మీ రాయిచ్చవచ్చిన విషయముంగూర్చి ప్రశ్నింపవచ్చును.

రాజు—నేనడుగఁదలఁచిన దిది—మీసఖి వివాహపర్యంతము నిట్టితాపసవృత్తి నవలంబించియుండునా? కాక యావజ్జీవము నిట్టి హరిణీగణసహవాసమునఁ గాలక్షేపము చేసికొనుచుండునా?

ప్రియం—అనురూపవరుఁడు లభించుపక్షమున శకుంతలకు వివాహము చేయవలెనని తండ్రియగు కణ్వమహర్షి సంకల్పించియుండెను.

ఆమాట విని రాజు పరమానందముతోఁ దనలో "అట్లయినచో శకుంతలాలాభము నాకుఁ గోరుకొనఁదగనిది కాదు. హృదయమా! ఊఱడిల్లుము! ఇప్పటికి నీసంశయము దూరమైపోయినది. దేనిని నీవగ్నికణముగా భావించితివో యది యిప్పుడు స్పర్శసుఖశీతలమగు రత్నముగా మాఱినది." అని యనుకొనియెను.

శకుంతల కపటకోపమును నటించుచు "అనసూయా! నేను పోయెదను. ఇంక నిచ్చట నుండను" అనియెను.

అన—సఖీ! ఏలపోయెదవు?

శకుం—చూడుము! ప్రియంవద నోటికి వచ్చినట్లెల్ల మాటలాడుచున్నది! నేను పోయి పూజ్యురాలగు గౌతమి కిది యంతయును దెలిపెదను.

అన—చెలీ! అభ్యాగతుఁడగు నీమహాశయున కింకను బరిచర్య చేయనేలేదు. అతిథిసేవాభారమంతయు నిప్పుడు

నీమీఁద నున్నదిగదా! ఇప్పు డీని సత్కరింపకుండ నీయిచ్చవచ్చినట్లు పోవుట యుచితముకాదు.

శకుంతల యేమియు మాటాడకుండ వెడలిపోవుచుండెను. అప్పుడు ప్రియంవద శకుంతల నడ్డగించి “సఖీ! నిన్నుఁ బోనీయను! నీవు నాకొక కడవెఁడుజల మప్పుపడియున్నావు. ఆయప్పు తీర్చినచో నిన్నుఁబోనిచ్చెదను” అనిబలవంత పెట్టెను.

శకుంతల యించుక కోపగించుకొని ఋణవిముక్తి చేసికొనుటకై కలశమును గైకొని జలముఁ దెచ్చుటకుఁ బయనమయ్యెను. అప్పుడు రాజు “ప్రియంవదా! మీసఖి వృక్షములకు జలసేచనముంగావించుటచే నిదివఱకే చాల నాయాసపడియున్నది. ఆమె నింకను శ్రమపెట్టుటయుచితము కాదు. నేను మీచెలిని ఋణవిముక్తురాలింగావించెదను.” అని పలుకుచుఁ దనవ్రేలియుంగరముం దీసి “ఆకడవెఁడుజలమునకును మూల్యముగా నీవు దీనిందీసికొనుము!” అనియాయుంగరమును బ్రియంవదచేతికిచ్చెను.

అనసూయాప్రియంవద లాముద్రాంగుళీయకమునందలి యక్షరములఁజదివికొని విస్మయాపన్నలై యొకరిమొగము నొకరు చూచుకొన నారంభించిరి. ఆయుంగరమున దుష్యంత నామము ముద్రితమైయుండెను. ఆయుంగరము నిచ్చునప్పుడు తనపేరు దానిపై ముద్రింపఁబడి యుండెనని రాజునకు జ్ఞప్తి యేలేదు. పిమ్మట నాతఁడు తనసంగతి బయలుపడిపోయినదని గ్రహించి యించుక సావధానుఁడై “తపస్వికన్యలారా! ఈయుంగుళీయక

ము పైనున్న యత్తరములం గాంచి మీరు పుట్టయుకలాగున భా వింపవలదు. నేను రాజకర్మచారిని. నాయందలి యనుగ్రహ సూచకముగ మహారాజీలగుంగుళీయకమును నాకుఁ బ్రసాదించి యున్నాఁడు'' అనియెను.

ప్రియంవద రాజుకపటనటనమునుగ్రహించి ,,అయ్యా! అట్లయినచో నీయుంగరము మీవ్రేలి నెడఁబాయఁగూడదు. మీమధురవాక్యములచేతనే యీమెబుణము తీఱిపోయినది'' అనియించుక నవ్వుచు శకుంతలవంకఁదిరిగి ,,సఖీ! శకుంతలా! ఈమహాత్ముఁడు—కాదు—ఈమహారాజు నీ ఋణమును దీర్చె వైచినాఁడు! ఇష్టమున్నచో నీవిప్పుడుపోవచ్చును'' అనియెను.

శకుంతల తనలో ,,ఈమహాపురుషునివిడిచి పోవుట నాకు దుస్సాధముగా నున్నది.'' అని యనుకొనుచుఁ బ్రియంవదం జూచి ,,ప్రియంవదా! నన్నుఁ బొమ్మనుటకును, బోవద్దనుటకును నీవెవ్వరు?'' అనియెను.

రాజు శకుంతలవంక నాశానయనములఁ బరగించుచుఁ దనలో ,,నేనీమెయెడల నెట్లయియుంటినో యీమెకూడ నా యెడల నట్లుండెనో లేదో బోధపడుట లేదు. ఈమె నాతో మాట లాడుట లేదుగాని నామాటలను మనసుంచి యాలకించుచు న్నది. చూపులు గలసినప్పుడు మొగము మరల్చుకొనుచున్నను నొకనిమిషమైన మఱియొకవంకఁ జూచుట లేదు. ఈమెయంతః కరణమున ననురాగ సంచారము లేకయున్నచో నిట్టిభావోదయ

ముసరం గారణము లేదు" అని భావించుకొనుచుండెను.

ఇట్లుండఁగా ననతిదూరమునం దాకస్మికముగఁ గోలా హలము పుట్టెను. అప్పుడు కొంతమంది బిగ్గరగా, "ఓ తపోవనవా స్తవ్యులారా! దుష్యంతమహారాజు వేఁటకు వచ్చి తనపరివార ముతోఁ దపోవనసమీపమున విడిసియున్నాఁడు. రాజుగారి రథ మాఁగాంచి యొకవనగజము బెదరి తపస్సునకు రూపుదాల్చిన విఘ్నదేవతవోలె ధర్మారణ్యమునఁ బరిభ్రమించుచున్నది. శీఘ్ర ముగ మీప్రాణరక్షణమునకై జాగ్రత్తపడుఁడు! త్వరపడుఁ డు!" అని కేకలువైచుచుండిరి.

ఆతాపసకన్యక లావాక్యముల నాలకించి భయపడిపోవు చుండిరి. రాజు విరక్తుఁడై తనలో "ఎంతకష్టమెంతకష్టము! నా పరివారము నన్ను వెదకుచుండుటచేఁ దపోవనమునకుఁ బీడ యగుచున్నది! ఎట్లయిన నిప్పుడే పోయి యాకల్లోలము నడఁగిం పవలయును." అని యనుకొనియెను.

అప్పుడనసూయాప్రియంవదలు "మహారాజా! అడవి యేనుఁగుమాట వినిన మాకుఁ జాల భయమగుచున్నది. మాకు సెలవొసంగినచో మాకుటీరమునకుఁ బోయెదము" అని వేఁడు కొనిరి.

రాజు వ్యస్తచిత్తముతో "మీరు మీపర్ణశాలకుఁ బొండు. నేనును దపోవన పీడాపరిహారణమునకై ప్రయత్నించె దను." అనియెను.

అనసూయాప్రియంవదలు సెలవు గైకొని పోవుచు ,,మహారాజా ! పునర్దర్శన మగుఁగాక ! మీకు సముచితమగు నతిథిసత్కారము చేయఁజాలకపోయితిమి. ఇది మాకుఁ జాల లజ్జాకరముగ నున్నది " అని మనవిచేసిరి.

రాజు—అట్లనుకొనవలదు. మీదర్శనమువలననే మాకు యథేష్టమగు సత్కారలాభము కలిగినది.

పిమ్మట నందఱును వెడలిపోవుచుండిరి. శకుంతల నాలు గైదడుగులువైచి యొకవంకఁ బెట్టుకొని ,, అనసూయా ! ఇచ్చోటి కుశాంకురములు నాపాదములకు గ్రుచ్చుకొనుచున్నవి. నేను త్వరగా నడువఁజాలను. ఇంతేకాక, నావల్కల మీకురువక శాఖకుఁ దగుల్కొన్నది. ఇంచుకసేపాఁగుము ! వదలించుకొని వచ్చెదను " అని పలుకుచు నారచీరను వదలించుకొను నెపంబున నించుక యాలస్యముచేసి వెనుకకుఁ దిరిగి యాశాసయన ములతో రాజువంక నిరీక్షింపఁదొడంగెను.

రాజు తనలో ,, ఈశకుంతలను జూచినప్పటినుండియు నాకు నగరముపై మనసు పోవుటలేదు. కావున నేనీతపోవన ప్రాంతమునందే విడిస యుండెదను. ఏమిది ! నాహృదయమును శకుంతలనుండి మరలించుకొనఁజాలకున్నాను ! " అని యనుకొనియెను.



## ద్వితీయాంకము.

### ప్రథమదృశ్యము—శిబిరము.

రాజు వేఁటకు వచ్చునప్పుడే తనవేడుకచెలికాఁ డగు మాధవ్యుఁ డను బ్రాహ్మణకుమారునిగూడఁ దీసికొనివచ్చెను. రాజసహచరు లెప్పుడును నియమితరాజభోగముల ననుభవించుచు విలాసముగఁ గాలక్షేపము చేయుచుందురు. అశనవసనములకుఁ గాని శయనోపవేశనములకుఁ గాని యెట్టిలోపము వాటిల్లినను వారు సహింపఁజాలరు. ఏమనిన—వారెల్లప్పుడును రాజభోగముల ననుభవించుచుందురు! మాధవ్యుఁడు రాజధానియం దశేషసుఖభోగములతోఁ బ్రొద్దులు గడపుచుండెను. మహారణ్యమునం దట్టిసుఖ మెక్కడిది! ఆతని కిట నన్నియును గష్టములే కలుగుచుండెను.

మాధవ్యుఁ డుదయముననే లేచి యతివిరక్తుఁడై "కేవలమును మృగయాసక్తుఁడగు నీరాజుతోఁగూడ వచ్చుటచే నా ప్రాణములు చలించిపోవుచున్నవి. ప్రతిదినమును దెల్లవారకుండ లేచి వేఁటకుఁ బోయి "ఇదిగో! లేఁడి! అదిగో! పంది! అల్లదిగో! పులి!" అని పలికించుచు మధ్యాహ్నమువఱకు నడవిలో నల్లాడవలయును. అందుపై గ్రీష్మకాలము. సరోవరములయందుఁగాని సెలయేళ్ళయందుఁగానిగుక్కెడునీరైనదొరకుట లేదు. ఒకవేళ దొరకినను నిరంతరమును రాలుచుండునెండుటా

కులచే నానీరు కటుకషాయితమై త్రాగుట కసహ్యమైపోవుచున్నది! ఏమిచేయుదును? దాహముచే నోరెండుకొనిపోవుటవలన నట్టినీరే త్రాగుచున్నాను. వేళకు భోజనమైన లేదుగదా! ప్రతిదినమును భోజనవేళ యతిక్రమించియేపోవుచున్నది! ఆయాహారముమాత్రము బాగుగఁ బచనమగుట కవకాశ మెక్కడిది! అన్నిటికిని దొందరయే. ఉదయకాలము మొదలు మధ్యాహ్నమువఱకు గుఱ్ఱముమీఁదనే ప్రయాణమగుటచే సర్వాంగకములును గమియఁగొట్టినట్లుగా నగుటచే రాత్రులయందైనను సుఖనిద్రపట్టుట లేదు. ఒకవేళఁ దెల్లవాఱుజామున నిద్రవచ్చినను వేఁటగాండ్రకోలాహలధ్వనుల మూలమున వేకువజామునందే నిద్రాభంగమైపోవుచున్నది. ఈపీడ యింతలో వదలిపోవునట్లు తోఁచుటలేదు. మొన్నటిదినమున నేను రాజుతోఁ గలసి వేఁటకుఁబోయి యాయాసముచే వెనుకఁబడిపోయితిని. ఆతఁడొక హరిణమును దఱుముకొనుచుఁ బోయి తపోవనమునఁ బ్రవేశించి నాదురదృష్టవశంబున శకుంతలయను నొకతాపసకన్యకను జూచి యున్నాఁడు. ఆమెను జూచినదిమొదలుగ నింటికిఁ బోవలయుననుమాటయే యాతనినోటినుండి వెడలుట లేదు. ఆమెనుగూర్చినతలంపులతోనే యాతనికి రాత్రులు తెల్లవాఱిపోవుచున్నవి. ఒక్కసారియైనను గన్నులు మూఁతపడుటలేదు." అని విసుగుకొనుచుండెను.

ఆసమయమునకు సరిగ రాజు వేఁటదుస్తులను ధరించి

వేటగాండ్రచేఁ బరివేష్టింపఁబడి యావంకకే వచ్చుచుండెను. ఆతనిం గాంచి మాఢవ్యుఁడు తనలో "నేనిప్పుడు వికలాంగునివలె నొక్కచోఁ బడియుండెదను. ఈవిధముగానైన నించుక సేపు విశ్రాంతిసుఖము ననుభవించెదను." అనియనుకొని యట్లే పడియుండి రాజు సమీపించినతోడనే మహాభయమును బ్రదర్శించుచు "వయస్యా! నాసకలాంగములు నవశములై యున్నవి. చేయెత్తి దీవించుటకైన నాకోపిక లేదు. కావున వాగ్రూపకముగనె నిన్నాశీర్వదించుచున్నాను." అనియెను.

రాజు——వయస్యా! ఇదియేమి యిట్లున్నావు?

మా——ఏమని చెప్పుదును? స్వయముగాఁ గన్నువాడిచి కంటనీరు వచ్చుచున్నదేమని యడుగుచున్నావే!

రాజు——చెలికాఁడా! నీయూహ నాకు బోధపడుట లేదు; స్పష్టముగాఁ జెప్పుము!

మా——నదీతీరముసందలి ప్రబ్బలితీఁగ కుబ్జభావము నవలంబించుటకుఁ గారణము దానియిష్టమా? కాక నదీప్రభావమా?

రాజు——నదీప్రభావమే——

మా——అట్లే——నాయస్వస్థతకు నీవు కారణమైతివి.

రాజు——ఇది యెట్లు?

మా——నేనేమని చెప్పుదును? రాజ్యకార్యములను బరిత్యజించి యూాఘము,గా వనచరమార్గము నవలంబించి నిరంతర

ము నడవుల వెంటఁ బరిభ్రమించుట నీవంటివానికిఁ దగునా?
నేను బ్రాహ్మణకుమారుఁడను. సర్వదా నీవెంటఁబడి మృగా
న్వేషణమునకై యడవులఁబట్టి తిరుగుచుండుటచే నాశరీరము
నందలి సంధిబంధములన్నియు శిథిలములై పోయినవి. నాశరీర
మంతయు నవశమై యున్నది. కావున నిన్ను వినయముతోఁ
బ్రార్థించుచున్నాను. నాకొక్కదినమైన విశ్రాంతికొఱకు సెల
వొసంగుము !

రాజా మాటల నాలించి తనలో "ఇతఁ డిట్లనుచున్నాఁ
డేమి? శకుంతలను జూచిననాఁటనుండియు నాకు వేఁటయం దు
త్సాహము పుట్టుటలేదు; వింట బాణములను సంధించుటయే
గాని హరిణములపైఁ బ్రయోగింపఁజాలకున్నాను. ఆహరిణ
ముల ముగ్ధనయనములను జూచినతోడనే యలౌకికవిభ్రమవిలా
ససుందరంబు లగుశకుంతలతరళనయనములు జ్ఞప్తికి వచ్చుచు
న్నవి." అని యనుకొనుచుండెను.

మాధవ్యుఁడు రాజునంకఁ దిలకించి "యేమియాలోచిం
చుచున్నావు? నావిన్నప మంతయు నరణ్యరోదనమే యైనదా?"
అనియెను.

రాజించుక నవ్వుచు "చెలికాఁడా! నాకింకొకయాలో
చన మేదియును లేదు. మిత్రవాక్యము నుల్లఘింపఁగూడదుగ
దా—ఏమిచేయుదు నని భావించుచున్నాను." అనియెను.

మా—నీవు దీర్ఘాయుష్మంతుఁడవగుము. నీమాటయే

చాలును. నాకుఁ బరమానందముగా నున్నది.

అని మాఢవ్యుఁడు వెడలిపోవుట కుద్యమించెను. అప్పు డు రాజు "మిత్రమా! పోయెదవేమి? ఒక్కమాట యున్నది" అనియెను.

మాఢవ్యుఁడు వినవలయునను నాత్రముతో లేచి నిలు వఁబడి "అదియేమో చెప్పుము!" అనియెను.

రాజు—ప్రియవయస్యా! సులభసాధ్యంబగు నొకకా ర్యమునందు నీవు నాకించుక సాహాయ్యము చేయవలయును.

మాఢ—తెలిసినది. ఇఁకఁ జెప్పనక్కఱలేదు. మధుర భక్ష్యములతో మధురాహారముల నారగింపవలయును గాఁబో లును! ఆవిషయమున నాకు విలక్షణమగు నైపుణ్యమున్నది గాదా! ఆలాగే—అనాయసముగ నీకు సాయము చేసెదను.

రాజు—కాదోయి! నేను గోరినది యదికాదు—

అని చెప్పుచు రాజు ద్వారికుని బిలిచి "సేనాపతిని బిలిచికొనిరమ్ము!" అని యాజ్ఞాపించెను.

రాజాజ్ఞ నాలకించి సేనాపతి యతిత్వరితముగ వచ్చి రాజు నెదుట నిలువఁబడి "మహారాజునకు జయమగుఁగాక!" యని చేతులు జోడించుకొని "మహారాజా! అన్నియు సిద్ధము చేసితిని. ఇఁక నూరక కాలయాపన మేల? వేఁటకు బయలు దేఱవచ్చును" అనియెను.

రాజు—ఇప్పు డీమాధవ్యుఁడు వేఁటను నిందించి నాకు నిరుత్సాహాము గల్పించినాఁడు.

సేనాపతి రాజున కెఱుకపడకుండ మాధవ్యునిం గాంచి మెల్లగా ,, మిత్రమా! నీవు నీపట్టు వదలకుము! నేను కొంత సేపటివఱకును బ్రభువువారి చిత్తవృత్తి ననుసరించి మాటాడె దను '' అని రహస్యముగఁ జెప్పి పిమ్మట రాజు నుద్దేశించి ,, మహాప్రభూ! ఈపిచ్చివాని మాటలతో మనకేమి పని? ఈతఁ డొకప్పుడు మాత్రము మంచిమాట చెప్పెనా? వేఁట యనుకూలమైనదో, ప్రతికూలమైనదో దేవరవారే యాలోచిం పఁగూడదా? చూడుఁడు! వేఁట స్థూలశరీరమును బరిశ్రమ మూలమున గట్టిపఱచును; మందత్వమును బోఁగొట్టును; శరీర మునకుఁ బాటవమును, సామర్థ్యమును కర్మదార్ఢ్యమును గలి గించును; భయక్రోధాదిసమయములయందు మృగముల గతు లెట్లుండునో బోధపఱచును; మఱియు శరసంధానమునందును లక్ష్యభేదనమునందును గరలాఘవమును సమకూర్చును. లక్ష్య ము చెదరకుండ బాణప్రయోగముం గావించుటకంటె ధనుర్ధ రునకుఁ గోరఁదగిన శ్లాఘాపాత్రమగు విషయము మఱియేమున్నది? కావున మహాప్రభూ! వేఁటనుగూడ వ్యసనములలోఁ జేర్చుటకంటె బుద్ధిహీనత మఱియొకటి లేదు. ఇంతయానంద ము—ఇంతయుపకారము మఱిదేనివలనఁ గలుగునో మీరే యాలోచించి సెలవిండు!'' అనియెను.

ఆమాటలకు మాధవ్యుఁడు కపటకోపమును నటించుచు ,, ఓరిబుద్ధిహీనుఁడా! నీస్వభావమున దయ యనునది లేనేలేదు. నీపరివర్తనమున మాత్ర మెక్కడిది ? ఎవ్వఁడో యొక్కప్పుడు నీవడవుల వెంట నల్లాడుచుఁ దప్పకుండ నరనాసికాలోలుపంబగు క్రూరభల్లూకము నోటఁ బడిపోయెదవు లెమ్ము! ఇది నీకుఁదప్పదు. నేను దివ్యదృష్టిం జూచి చెప్పుచున్నాను ” అనియెను.

వారి వాగ్వాదము నాలకించుచున్న రాజు సేనాపతిం జూచి ,, సేనాపతీ ! చూడుము ! మనమిప్పుడు తపోవన సమీపమునందున్నారము. కావున నేనిప్పుడు నీమతమునకు సమ్మతింపఁజాలను. ఇఁక నిప్పుడు వనమహిషములు దొరువులంబడి నిరుద్వేగముతో జలక్రీడ లాడుకొనుఁగాక ! కురంగతండములు తరుచ్ఛాయలయందు వరుసలుతీరి పరుండి నెమరువేసికొనుచుం డుఁగాక ! వనవరాహములు నిశ్శంక చిత్తములతోఁ బల్వలము లయందలి తుంగముస్తలను గడుపార నారగించుఁగాక ! ఇఁక నావిల్లును బాణములును విశ్రాంతి సుఖము ననుభవించుఁ గాక !'' అనియెను.

సేనా—దేవరవారిచిత్త మెట్లో యట్లే యగుఁగాక !

రాజ—సరేకాని యింతకుముందే వేటకుఁ బోయిన వారి నందఱను మరల వెనుకకుఁ బిలిపింపుము. తపోవనమున కెంతమాత్రమును బీడ కలిగింపకుండ మెలంగవలయునని మన సైనికుల కందఱకు నాజ్ఞాపింపుము !

సేనాపతి చిత్తమని చెప్పి వెడలిపోయెను. తరువాత రాజు తన్ను సమీపించిన మృగయాసహచరులకు వేఁట వేషములను వదలించి వైచెను. వారు రాజాజ్ఞం గైకొని వెడలిపోయిరి. అప్పుడు రాజును మాధవ్యుఁడును గలసి సమీపలతామండపమునకుఁ బోయి యచ్చట నొక చలువఱాతిన్నెపైఁ గూర్చుండి యుండిరి.

---

## ద్వితీయ దృశ్యము.

### లతామండపము.

ఇరువురు నేకాంతముగఁ గూర్చుండి యున్న సమయమున రాజు మాధవ్యు నుద్దేశించి "మిత్రమా! నీకుఁ గన్నులున్న ఫలము లభింపలేదు. కారణ మేమనిన—నీవు దర్శనీయమగు వస్తువును జూడఁజాలకపోయితివి!" అనియెను.

మాధ—ఏమి? అతిలోక మోహన మూర్తివగు నీవు నాయెట్టయెదుటనే యుంటివి గదా?

రాజు—అదికాదు. నేనీ యాశ్రమమున కలంకారస్వరూపిణి యగుకణ్వతనయ శకుంతలంగూర్చి చెప్పుచున్నాను.

మాధ—వయస్యా! వేఁడుకకొలఁది కడుగుచున్నాను—

నీకుఁ దపస్వికన్యకయందే యభిలాష కలుగుచున్నదా?

రాజు—సుహృద్వరా! పురువంశీయులు నిషేధవస్తువు నుపభోగింపఁ గోరుసంతతి దురాచారపరులు కాఁజాలరు! నీవె ఱుఁగవు కాఁబోలును! ఆశకుంతల మేనకా గర్భసంభూత. రాజర్షి యగు విశ్వామిత్రుని తనయ—తపోవనమునఁ బెంపఁబడినదిగాని కేవలము తపస్వికన్యక గాదు.

రాజునకు శకుంతలయందు గాఢానురాగము గలిగినదని గ్రహించి మాధవ్యుఁడు నవ్వుచు " మధుర పదార్థభక్షణమున మొగముమొత్తిన జిహ్వకుఁ జింతకాడపై మనసు పోయినట్లుగా నలోకసామాన్యరూపలావణ్యవతులగు స్త్రీరత్నముల నుపభోగించుచున్న నీకిట్టికోరిక కలుగుచున్నది. " అనెను.

రాజు—కాదు మిత్రమా! నీవాశకుంతలను జూడలేదు. కావుననే యిట్లనఁ గలుగుచున్నావు!

మాధ—ఏవస్తువు నీకంటికిఁగూడ విస్మయమును గలిగింపఁ జాలినదో యావస్తువు తప్పక రమణీయ మైనదే యని చెప్పుటకు సందేహ మేమున్నది?

రాజు—మిత్రమా! వేయిమాట లేల? నిజముగా నాకిట్లు తోఁచుచున్నది. మొట్టమొదట విధాత యామెను జిత్తరువుగఁ జేసి తరువాతఁ బ్రాణప్రదానముం గావించియుండును. కాదేని తనమనసునందే సంకల్పమాత్రమునఁ దనయిచ్ఛవచ్చిన యుపకరణములను సంపాదించి సంకల్పమాత్రముననే సకలాంగ

కములను యథార్థస్థానములయందు యథోచితములుగాఁ గూర్చియుంచి యాదివ్యసుందరమూర్తిని నిర్మించియుండును. ఆదివ్య మంగళవిగ్రహమును దేవదేవుఁడు తనహస్తములచేతనే నిర్మించి యున్నచో నంతటికోమలత్వమును నంతటి రూపలావణ్యసంపదయు నెట్లు సమకూరును ? ఆమాధుర్య మెట్లు లభించును ? చెప్పవలసిన దేమున్నది ? అదియొక యభూత పూర్వం బగు స్త్రీరత్నసృష్టి !

మాధ—ప్రియమిత్రమా ! శకుంతల సృష్టియందలి రూపవతులగురమణీమణుల కందఱకును బరాభవస్థానమై యున్నదని బోధయగుచున్నది.

రాజు—ఆమెరూప మాఘ్రాణింపఁ బడని వికసితపుష్ప సూనము వంటిది; నఖక్షత మెఱుంగని నవపల్లవము వంటిది; సూదిమొనతాఁకని నూతన రత్నము వంటిది; ఆస్వాదింపఁబడని మధురమధువువంటిది—జన్మాంతరపుణ్యమున కఖండఫలము వంటిది—ఆవినిర్మలమధురసౌందర్యము నుపభోగించుభాగ్య మే మహాపురుషునకు లభింపనున్నదో యెవ్వరికెఱుక?

రాజు శకుంతల నిట్లు వర్ణించుటఁగాంచి మాధవ్యుఁడు చమత్కృతుఁడై “వయస్యా! అట్లయినచో శీఘ్రముగఁ బెండ్లి చేసికొనుము! ఆదుర్లభసౌందర్యధామయగు కన్యాలలామ యెు కానొకయడవితపస్వి చేతులలోఁబడి నిరర్థకురాలై పోకుండఁ జూచుకొనుము!” అనియెను.

రాజ—మాధవ్యా! శకుంతల కేవలము పరాధీనురాలై యున్నది. మఱియు నిప్పుడు కులపతి యగుకణ్వమహర్షి కూడ నాశ్రమమునందు లేఁడు!

మాధ—మిత్త్రమా! ఇదియును మంచిదే—నిన్నొక మాట యడుగుచున్నాను. నీయం దామె కనురాగము కలిగి నదా?

రాజు—చెలికాఁడా! మునికన్యకలు కేవలమును ముగ్ధస్వభావలుగదా! అయినను నామెస్వభావములనుబట్టి యామెకు నాయందనురాగ ముదయించునట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది. ఆమె నాయెదుటనే యుండి నాతో మాటాడకపోయినను నామాటలనుమాత్త్రము తదేకచిత్తముతోఁ జెవియొగ్గి యాలకించినది. చూపులుగలియు సమయమునందామె యించుక మొగము మరల్చినను క్షణమైన మఱియొకవంకఁ జూచుట లేదు. ఇంతేకాదు—ఆమె కుటీరమునకుఁ బోవుసమయమున నాలుగై దడుగులుమాత్రము నడచి కుశాంకురములు గుచ్చుకొనుచుండె ననునెపంబున ముందడుగు వేయఁజాలక పోయినది; కురువకశాఖకుఁ దగులుకొన్నవల్కలమును దెమలించుకొను వ్యాజముచే నించుక యాఁగి యొకసారి నావంకఁ దిరిగి చూచినది. ఆచూపులో ననురాగసుధారసము పొంగిపొరలినది. ఇవి యన్నియు ననురాగలక్షణములు కాక మఱియేమనియెదవు?

మాధ—అట్లయినచో నీకోరిక శీఘ్రముగనే ఫలింపఁ

గలదు. భాగ్యవశంబున నీతపోవనమే నీయుద్యానవనమగును!

రాజు—ఇందలిమహర్షులలోఁ గొందఱు నన్నెఱుంగు దురు. ఏమిష పెట్టుకొని మనమీతపోవనమునం దుండవచ్చునో చెప్పుము చూతము!

మా—లేనిపోనిమిషలతో నేమిప్రయోజన మున్నది? నీవు మహారాజవు! తపోవనమునకుం బోయి తపస్వులం గాంచి మీరు రాజునకీయవలసిన పన్నుల నిచ్చువఱకును నేనిచ్చటనే యుండెదనని చెప్పుము!

రాజు—సామాన్యప్రజలవలె సంయమీంద్రులు పన్నులనిచ్చువారుకారు—వారు మఱియొకవిధమైనపన్నిచ్చుచుందురు. వారుప్రసాదించురాజస్వము రత్నసమూహము కంటెను సర్వోత్కృష్టమైనది; వాంఛనీయమైనది. చూడుము! సామాన్యప్రజలొసంగెడి రాజద్రవ్య మశాశ్వతమైనది. కాని మహర్షులు తమతపస్సులలోని యాఱవభాగముగా నిచ్చుచున్న రాజస్వము మాత్రము శాశ్వతమైనది; సర్వోత్తమమైనది.

ఇట్లు వారుసంభాషించుకొనుచుండఁగా ద్వారపాలకుఁడచ్చోటికి వచ్చి ''మహారాజా! తపోవనమునుండి యిరువురు మునికుమారులు దేవదర్శనముకై వచ్చియున్నారు.'' అనిమనవి చేసెను.

రాజు ''వారిని వెంటనే తీసికొనిరమ్ము!'' అని యాజ్ఞాపించెను. ద్వారపాలకుఁడు వెడలిపోయెను. కొలఁదిసేపటిలో ఋషికు

మారులు రాజునెదుటికి వచ్చి చేతులెత్తి ,,మహారాజునకు జయ మగుఁగాక!'' అని యాశీర్వదించిరి. తోడనే మహారాజు పీఠము నుండిలేచి వారికి నమస్కారములం గావించి ,,మునికుమారులా రా! మహర్షులు నాకేమనియాజ్ఞాపించినారు?'' అని ప్రశ్నించెను.

మునికు—మహారాజా! మీరీతపోవనమునకు వచ్చితిరని తెలిసికొని మహర్షులు మిమ్మిట్లు వేఁడుకొనుచున్నారు-,,భగవా నుఁడగుకణ్వమహర్షి యిప్పుడీయాశ్రమమునందు లేఁడు. ఆకార ణముచే ముష్కరులగునిశాచరులు యజ్ఞకార్యముల కంతరా యములం గల్పించుచున్నారు. కావునఁ గణ్వమహర్షి వచ్చువఱ కును మీరిచ్చటనే యుండి యీయుపద్రవములను నివారింపవల యును'' అని—

రాజు—మహర్షు లిట్లాజ్ఞాపించుటచే నేననుగ్రహింపఁ బడితిని.

మాధ—మిత్రమా! ఇంకనేమి? ఇదియును నీకనుకూల ముగనే యున్నది!

ఆమాట విని రాజు చిఱునవ్వు నవ్వుచు దౌవారికునిం బిలిచి, ''ఓరీ! రథమును సిద్ధముచేయుమని సారథితోఁ జెప్పు ము!'' అని యాతనిఁ బంపి మునికుమారులం గాంచి ''మీరింక దయచేయవచ్చును. నేను యథాసమయమునకుఁ దపోవనము నఁ బ్రవేశించెదను'' అనియెను.

ఋషికుమారులు పరమానందభరితహృదయులై ''కా

కేమి? నీవేవంశమున జనియించితివో యావంశమున కిది విఖ్యాతకధర్మమేగదా! ఆపన్నుల కభయప్రదానముం గావించుటయే పురువంశప్రదీపకులవ్రతము!" అని మనవిచేసి మహారాజు నాశీర్వదించి వెడలిపోయిరి.

పిమ్మట రాజు మాధవ్యునిం జూచి " వయస్యా! నీకు శకుంతలను దర్శింపవలయునను కుతూహలమున్నచో నాతోఁ గూడ బయలుదేఱుము" అనియెను.

మాధ——నీవామెరూపమును వర్ణించినప్పటినుండియు నేనామెను దర్శింపవలయునని యెంతయో వేడుకపడుచున్నాను. కాని——కాని——ఇప్పు డీనిశాచరులమాట నాచెవులఁ బడినతోడనే నాయుద్దేశమంతయు నొక్కసారిగా మాఱిపోయినది.

రాజు మందహాసముచేయుచు " మాధవ్యా! అంతభయమేల? విడువకుండ నిరంతరము నాచెంతనే యుండుము" అనియెను.

మా——మంచిది. రాజవగు నీయొద్దనున్నచో నారాక్షసు లేక నన్నేమిచేయఁగలరు?

అంతలో దౌవారికుఁ డరుదెంచి "మహారాజా! రథము సంసిద్ధమైనది. ఏలినవా రారోహింపవచ్చును. కాని యిప్పుడే రాజధానినుండి పట్టపుదేవిసందేశముం గైకొని కరభకుఁడను వచ్చి దేవరసందర్శనముకొఱకు వేచియున్నాఁడు" అని మనవిచేసెను.

రాజు——శీఘ్రముగ నాతని నాయొద్దకుఁ దీసికొనిరమ్ము.

ద్వారపాలకుఁడు వెడలిపోయినంతనే కరభకుఁడు రాజు నెదుటికి వచ్చి నమస్కరించి చేతులు జోడించుకొని నిలువఁబడి "మహారాజా! నేఁటికి నాలవనాఁడు వృద్ధరాజ్ఞీమణిగారేదియో యొక వ్రతముచేయుటకు సంకల్పించుకొన్నారఁట. ఆనాఁటికి దేవరవారు దయచేసి యావ్రతమును జరితార్థముగఁ జేయవలయునని తల్లిగారాజ్ఞాపించుచున్నారు" అని విన్నవించెను.

రాజావార్త విని నితాంతవ్యాకులహృదయుఁడై "ఒక వంకఁ దపస్వికార్యము—మఱియొకవంకఁ దల్లిగారియాజ్ఞ—రెండును విధాయకధర్మములే—అనుల్లంఘనీయములే. ఏమి చేయుదును?" అని యనుకొనియెను.

మాధవ్యుఁడు పరిహాసముచేయుచు "మిత్రమా! అంతయాలోచన మేల? త్రిశంకునివలె మధ్యస్థలమున నిలిచియుండుము!" అనియెను.

రాజు—"మిత్రమా! ఇది పరిహాసమునకు సమయము గాదు; నిజముగా నాహృదయము వ్యాకులపడుచున్నది. ఏమి చేయుటకును నిశ్చయింపఁజాలకున్నాను—" అని యించుకసేపాలోచించి "మాధవ్యా! అమ్మగారు నిన్నుఁగూడఁ గన్నకుమారునివలెఁ జూచుకొనుచున్నారుగదా! నీవిప్పుడు నామారుగా రాజధానికిఁ బోయి తల్లిగారికిఁ దనయుఁడు చేయఁదగిన సేవాధర్మమును నిర్వర్తింపుము. నేను దపస్వికార్యమున నిమగ్నుఁడనై యుంటిననియు నందువలననే రాఁజాలకపోయితి ననియుఁ

తల్లిగారితో మనవి చేయుము " అని చెప్పెను.

మాధ — మంచిది. నేనిప్పుడే పోయెదను. కాని నేను రాక్షసులకు భయపడి పాఱిపోవుచుంటి ననిమాత్రము నీవను కొనవలదు! — నేనిప్పుడు రాజునకుఁ దమ్ముఁడ నైతిని. కావున రాజసోదరునివలెనే రాజధానికిఁ బోవలయు నని కోరుకొను చున్నాను.

రాజు — మాధవ్యా! నాతో వచ్చిన పరివారజన మింకను నిందున్నచో నాశ్రమశాంతికి భంగకరముగా నుండును. కావున నాపరివారము నంతను నీ వెంటనే పంపించెదను.

మాధ — (పరమానందముతో) ఇఁక నేమి! అట్లయినచో నేనిప్పుడు యువరాజును గూడ నైతిని!

ఈవిధముగా మాధవ్యుఁడు రాజధానికిఁ బోవుటకు నిశ్చయింపఁబడినతరువాత రాజు తనలో " ఈతఁ డతిచంచలస్వభావుఁడు. అవివేకి యగు నీతఁ డొకవేళ శకుంతలావృత్తాంతము నంతఃపురమునఁ జెప్పినను జెప్పవచ్చును. ఇప్పు డుపాయమేమి? ఒకనెపముపెట్టి యీతని మఱపించి పంపించెదను " అని భావించుకొని మాధవ్యుని చేయి పట్టుకొని " మిత్రమా! మహాఋషులు కొన్నిదినములవఱకును దపోవనమునం దుండవలయు నని నాకాజ్ఞాపించియున్నారు. అందుకొఱకే నేనిచ్చోట నుండవలసివచ్చినది. అంతేకాని నిజముగా శకుంతలయందలి యభిలాషవలనఁ గాదుసుమా! నీవు సత్యములనుకొంటివేమో కాని నేనిది

వఱకు శకుంతలంగూర్చి చెప్పినమాట లన్నియును కేవలము హాస్యమున కాడినమాటలే—ఆవిషయము నీవు మ[illegible]కలా గనుకొనవలదు " అనియెను.

మాధ—నేనంతటి బుద్ధిహీనుఁడను గాను. నీమాటలన్ని యును సత్యము లనియే నేను నమ్మితి ననుకొంటివా?

పిమ్మట రాజు మహర్షుల యజ్ఞసంరక్షణమునకై తపోవ నమునఁ బ్రవేశించెను. మాఢవ్యుఁడు రాజపరివారముతో రాజ ధానికిఁ బ్రయాణ మయ్యెను.

---

## తృ తీ యాం క ము.



### ప్రథమదృశ్యము—నికుంజము.

రాజు తనపరివారమునంతను మాఢవ్యునితోఁ బంపివైచి మునికార్యమునకై తానుమాత్రము తపోవనమునం దుండెను. కాని యాతఁడు రేయుంబవలు శకుంతలాధ్యానమునందే నిమగ్నుఁడై యుండుటచేఁ జాల గృశించిపోవుచుండెను. శరీరసంస్కార మేమియును లేక మలినుఁడై దుర్బలుఁడై యెల్లకార్యములయందును నిరుత్సాహుఁడై యుండెను. ఆహారవి[illegible]ము

నాసనములయం దాతని కంతఃపూర్తిమును సుఖము కలుగుట లేదు. ఎప్పుడెచ్చోటికిఁ బోయిన శకుంతలదర్శన మగునో యని యాతఁడు తదేకధ్యానముతో ననుసంధానము చేయుచుండెను. కాని తనయుద్దేశ మాశ్రమవాసులకుఁ దెలిసినచో నేమని శంకింతురో యని సంకోచించు చుండెను.

ఒకనాఁటి మధ్యాహ్న సమయమున రాజొకచో నొంటిగఁ గూర్చుండి " శకుంతలాదర్శనము లభింపనిచో నేనిఁక జీవింపఁ జాలను. కాని యిచ్చోటఁ దపస్వికార్యము సంపూర్ణముగ జరిగిపోయినది. మహర్షు లెప్పుడు సెలవొసంగెదరో యప్పుడే నేను రాజధానికిఁ బోవలయును. పోయినచో నాగతి యేమగును! పరితపించుచున్న యీనాప్రాణములను జల్లఁబఱచుకొనుట కుపాయ మేమున్నది? ఎట్లయినను శకుంతల యిప్పు డెయ్యెడ నుండెనో చూచితీరవలయును. ఆ మె యీ యెండ వేళ మాలినీతీరమునందలి శీతలలతామండపమునఁ గూరుచుండి గ్రీష్మతాపము నపనయించుకొనుచుండఁగలదు. నేనక్కడకుఁ బోయి నాప్రాణప్రియను గన్నులారఁ గనుఁగొనియెదను " అని భావించుకొని యాతఁ డొంటిగా నాగ్రీష్మమధ్యాహ్నసమయమున లతామండపముంగూర్చి ప్రయాణమై పోయెను.

రాజదర్శన మైనదిమొదలు శకుంతలయును దుస్సహావిరహావేదనావివశయై కృశించిపోవుచుండెను. ఇప్పటిశకుంతల యవస్థకును రాజునవస్థకును నించుకంతయుఁ బ్రభేదములేదు. నేఁటి

దినమున శకుంతల మిగుల నస్వస్థయై యుండుటం గాంచి యనసూయాప్రియంవదలామెను మాలినీతీరలతామండపమునకుం గొని పోయి యానదమునొకశీతలచంద్రకాంతశిలాతలంబున నవపల్లవములతోడను జలసిక్తంబులగు జలజపత్రములతోడను శయ్య యమర్చి యందామెను శయనింపంజేసి యనేకవిధముల శీతలోపచారములం గావించుచుండిరి.

రాజు మెల్లమెల్లగా నానికుంజమును సమీపించి పదచిహ్నములు మొదలగులక్షణములవలన శకుంతల యందున్నట్లు గ్రహించి యించుక ముందునకుంబోయి లతాంతరాళమునందలి శకుంతలను సందర్శించి పరమానందభరితహృదయుండై ,,ఆహా! నాకన్నులు చల్లనైనవి! నాప్రాణేశ్వరి నాకంటఁబడినది!'' అని యుత్సాహముతో ననుకొనియెను. పిమ్మట రాజు వారిసంభాషణము నాలకింపవలయునను నుద్దేశముతోఁ దానొకపొదవెంట దాఁగియుండి యాశానయనములతో శకుంతలం గాంచుచు వారి పల్కుల నాలించుటకుం దదేకహృదయముతో నుండెను.

అంతకంతకు శకుంతలకు హృదయతాప మతిశయించుచునేయుండెను. అనసూయాప్రియంవదలు శీతలజలసిక్తంబులగు నళినీదళములచే నామెకు విసరుచు ,,సఖీ! శకుంతలా! ఈ తామరాకుల గాలి నీకించుకంతయైన సుఖకరముగ నున్నదా?'' అని యడిగిరి.

శకుం.—సఖులారా! ఆయాసపడుచు నీహారాకరమేల విసరెదరు?

అప్పుడనసూయాప్రియంవద లతివిషణ్ణవదనలై యొండొరుల మొగంబులఁ జూచుకొనఁ దొడంగిరి. నిజముగా నప్పుడు శకుంతల దుష్యంతధ్యానమునందే నిమగ్నయై యుండెను. కేవలమామెకు బాహ్యజ్ఞానమే లేదు.

రాజు విరక్తసూచకంబగు శకుంతల పలుకాలకించి యామెయవస్థం గాంచి యించుక యాలోచించి "ఈమె యస్వస్థయై యగపడుచున్నది. కారణ మేమైయుండును? గ్రీష్మతాపము వలననా? కాక నాయవస్థవలెనే యీమెయవస్థయు మారెనదా? ఇందును సంశయమేల? గ్రీష్మదోషముచే రమణీమణుల కిట్టి యవస్థ సంభవించు నని నే నెన్నఁడును వినియుండలేదు?" అని భావించుకొనియెను.

అప్పుడు ప్రియంవద శకుంతలకు వినఁబడకుండ ననసూయం గూర్చి "సఖీ! అనసూయా! ఆరాజర్షిని సందర్శించిన నిమిషము మొదలుగా మనశకుంతల యేదోవిధముగా నగపడుచున్నది. ఈయవస్థకుఁగూడ నదియే కారణము గాదుగద?" అని ప్రశ్నించెను.

అనసూయ "సఖీ! నాకును నదియే యనుమానముగా నున్నది. అడిగి తెలిసికొందము!" అని శకుంతల నుద్దేశించి "ప్రియసఖీ! శకుంతలా! నీశరీరగ్లాని యంతకంతకుఁ బ్రబల

మైపోవుచున్నది. కావున నిన్నొక మాట యడుగఁదలఁచియున్నాము ! ” అనియెను.

శకుం.—చెలీ ! ఏమడిగెదవో యడుగుము !

అన.—నీమనసులోని యుద్దేశ మేమో మాకించుకంతయైనను బోధపడుట లేదు. కాని యితిహాసకథలయందు విరహిణులయవస్థలంగూర్చి చదివి యున్నాము; ఇప్పుడు నీయందట్టిలక్షణములు కానఁగఁబడుచున్నవి. దానికేమి! నీకిప్పుడింతటి యసుఖము గలుగుటకుఁ గారణమేమో చెప్పుము ! రోగమేది తానా తెలియకుండఁ బ్రతీకారమునకుఁ బ్రయత్నించుటవలన లాభ మేమున్నది ?

శకుం.—ప్రియసఖీ ! నాకిప్పుడు చాల నాయాసముగా నున్నది. మాటలాడఁజాలను.

ప్రియం.—సఖీ ! అనసూయ బాగుగనే చెప్పినది. నీమనసులోని యుద్దేశమును బ్రియసఖుల మగు మాయొద్ద నేల మరుగుపఱచెదవు ? క్రమక్రమముగ నీవు కృశించిపోవుచుంటివి. ఇప్పుడు నీమూర్తియందుఁ గేవలచ్ఛాయామాత్రవిశిష్టంబగు లావణ్య రేఖకరణె మఱి శక్తియేమున్నది ?

రాజామాట నాలించి ,, ప్రియంవద చెప్పినమాట సత్యమే—శకుంతలశరీరము కేవలమును గృశించి వివర్ణమై పోయినది. కాని యెంత చిత్రము ! ఇట్టియవస్థయందుఁ గూడ నీమె నాహ్లా

డయనయనముల కనిర్వచనీయానందమును గూర్చుచున్నది ! "
అని యనుకొనియెను.

తుట్టతుదకు శకుంతల తన మనోవ్యథను మరుగుపఱుచు
కొనుట దుస్సాధమని నిశ్చయించుకొని యొక్క దీర్ఘనిశ్వాస
మును విడిచి ,, సఖులారా ! నాకష్టముంగూర్చి మీకుఁగాక
మఱియెవ్వరికిఁ జెప్పుకొందును ? నాదుఃఖసమాచారముం దెలి
పినచో మీకుఁగూడ దుఃఖముం గల్పించినదాన నగుదు నని
సంశయించుచున్నాను " అనియెను.

అప్పు డనసూయాప్రియంవదలు ,, ప్రాణసఖీ ! అందుకొ
ఱకేగాదా, మేమంతగా నడుగుచున్నాము ! ఆత్మీయులయెదుటఁ
గష్టములంగూర్చి తెలుపుకొనుటవలననే చాలవఱకు దుఃఖ
శాంతి యగునని నీవెఱుఁగవా తల్లీ ! " అని హెచ్చరించిరి.

అప్పుడు రాజించుక సంకోచముతో సుఖమున సుఖిం
చుచు, దుఃఖమున దుఃఖించుచు శరీరములు వేఱైనను నొక్కటె
ప్రాణముగనుండు ప్రాణసఖు లడిగినప్పుడు గూడ శకుంతల తన
మనోభావమును దెలుపకుండునా ? ప్రథమదర్శనదివసమునందే
వెడలిపోవునప్పుడీమె నావంక వలపుగొలుపు చూపులను మాటి
మాటికిఁ బ్రసరింపఁజేయుచుఁ దనలోని యనురాగమును స్పష్ట
పఱచియున్నది. ఆవిషయమై యనుమానించుట కవకాశము
లేకపోయినను నాహృదయ మిప్పుడీమె యేమనిచెప్పునో యని
తల్లడిల్లిపోవుచున్నది. " అని యనుకొనియెను.

శకుంతల ,,సఖీ! ఆనాఁడా రాజర్షిని సందర్శించినప్పటినుండియు——'' అనిమాత్రము చెప్పి సిగ్గుచేఁ దలవంచుకొని మఱి మాటాడఁజాలకపోయెను. అప్పు డనసూయాప్రియంవదలు ,, సఖీ! చెప్పుము! మాయెదుటఁగూడ నేలసిగ్గుపడియెదవు?'' అని పలికిరి.

శకుంతల ,, సఖులారా! అదిమొదలుగా నాహృదయ మామహాత్మునియందే లగ్నమైయుండుటచే నాకిట్టి యవస్థ కలిగినది '' అని చెప్పి విషణ్ణవదనముతో, నశ్రుపూర్ణనయనయుగ్మముతో, లజ్జాప్రకంపముతోఁ దలవంచుకొనియెను.

అనసూయాప్రియంవదలు పరమానందభరితహృదయులై ,, సఖీ! సౌభాగ్యవశంబున ననురూపవరునియందే నీకనురాగ ముదయించినది. మహానది సాగరమును బరిత్యజించి మఱి యేయితరజలాశయమునఁ బ్రవేశింపఁగోరును? ” అని మెచ్చుకొనిరి.

రాజామాట విని మహానందపారావారనిమగ్నుఁడై ,, ఆహా! వినఁదగినమాట వింటిని! పరితపించిపోవుచున్న నా హృదయ మిప్పటికిఁ జల్లనైనది! ” అని యనుకొనియెను.

శకుంతల ,, ఇఁక నీప్రబలసంతాపమును నేను సహింపఁజాలను; ప్రాణత్యాగముకంటె నాకిఁక సుఖోపాయము లేదు ” అనియెను. ఆమాటలకుఁ బ్రియంవద యదరిపడి శకుంతలకు వినఁబడకుండ ననసూయ నుద్దేశించి ,, సఖీ! ఇఁక నీమెను సాంత్వ

సవచనములచే శాంతింపఁజేయవలసిన సమయము దాఁటిపోయి నది ! ఇంకను గాలహరణము చేయుట మంచిదిగాదని నాకుఁ దోఁచుచున్నది. శీఘ్రముగ నేదేనొక యుపాయ మాలోచింప వలయును. ” అనియెను.

అన—అట్లయినచో నేయుపాయముచే నీమె మనోరథ మతి శీఘ్రముగను నతిరహస్యముగను సిద్ధించునో యాలోచించి చెప్పుము !

ప్రియం—రహస్యముగ నుంచువిషయమున నాలోచింపవలయును గాని శీఘ్రముగ సిద్ధింపఁజేయుట యంత కష్టసాధ్యము కాదు.

అన—అదియెట్లు ?

ప్రియం—నీవు చూడలేదా ? ఆరాజర్షియును మనశకుంతలను దర్శించిన నాఁటినుండియు దినదినమును గృశించుచునే యున్నాఁడు !

రాజామాట విని తనశరీరమువంకఁ జూచుకొనుచు ‟ నిజముగా నేనట్లే యున్నాను. ఔను. నిరంతరహృదయపరితాపముచే నాయొడలంతయు శుష్కించిపోయినది. ఇంతటి కృశత్వము—ఇంతటి దౌర్బల్యము నాకెన్నఁడును గలుగలేదు” అని నిశ్చయించుకొనియెను.

ప్రియం—అనసూయా ! నీవు శకుంతలచే నొక ప్రణయలేఖ వ్రాయింపుము. నేనొక పుష్పకందుకమున దానినుంచి

నిర్మాల్యచ్ఛలంబున రాజుచేతి కిచ్చెదను.

అన—ప్రియంవదా ! ఇది మంచియాలోచనము ! దీనికి శకుంతల యేమనునో ?

శకుం—సఖులారా ! నన్నేలయడిగెదరు ? మీయిష్టమే నాయిష్టము.

ప్రియం—అట్లయినచో నిఁక నాలస్యమేల ? నీహృదయభావమును బ్రకటించుచు నొక ప్రణయలేఖను వ్రాయుము.

శకుం—ఉత్తర మెట్లు వ్రాయవలయునో యాలోచించితిని—కాని యాతఁడు మన్నించునో మన్నింపఁడో యను సంశయముచే నాహృదయము కంపించిపోవుచున్నది.

ఆమాట విని రాజు నవ్వుకొనుచు ,, ఓ సుందరీమణీ ! ఎవ్వఁడు నిన్నుఁ దిరస్కరించు నని నీవు భయపడుచుంటివో యాతఁడే నీయనుగ్రహముకొఱకుఁ బరితపించిపోవుచున్నాఁడు. రత్న మెవ్వరిని వెదకఁబోదు—అందఱును రత్నాన్వేషణము కొఱకే ప్రయత్నించుచుందురు ” అని యనుకొనియెను.

శకుంతల యీవిధముగా సంశయించుచుండుటఁ గాంచి యనసూయాప్రియంవదలు ,, ఓసి వెఱ్ఱిదానా ! నీశక్తి నీకుఁ దెలియుట లేదు. చల్లనిశరత్కాలచంద్రిక కెవ్వఁడు గొడుగు చాటుచేసికొనఁగోరును ? ” అనుటయు శకుంతల మందహాసముచేసి లేఖావిరచనమున కుద్యుక్తురాలై ,, సఖులారా! ఆలో

చన కుదిరినది. వ్రాయుట కుపకరణములు లేవు. ఎట్లువ్రాయు దును ? " అనియెను.

ప్రియం——సఖీ ! అట్లనియెద వేమి ? ఈతామరాకుపై వ్రాయుము.

శకుంతల పత్రలేఖనమును ముగించి " సఖులారా ! వ్రాయుట యైనది. ఈలేఖ సంగతముగనున్నదో లేదో విని నిశ్చయింపుఁడు " అని శకుంతల యాయుత్తరమును జదువ నారంభించెను—" ఓనిర్దయుఁడా! నీహృదయము నాకు బోధ పడుటలేదు—కాని నేనుమాత్రము నిన్నుఁ బ్రేమించి నిరంతర మును బరితపించుచున్నాను—" ఇంతవఱకుఁ జదివినతోడనే రాజువిని యిఁకఁజాటున నుండఁజాలక యాకస్మికముగ నామె యెదుట సాక్షాత్కరించి " ఓసుందరీమణీ ! నీవు తపించిపోవుచు న్నమాట సత్యమే—నీవు నామాట నమ్మెదవో లేదోకాని నేను మాత్రము నిజముగ దహింపఁబడిపోవుచున్నాను" అని పలికెను.

మహారాజాకస్మికముగ సాక్షాత్కరించుట కనసూయా ప్రియంవదలు హర్షవికసితహృదయకమలలై తత్తరమున లేచి రాజును గుశలమడిగి పరమాదరముతో నాతనిఁ గూర్చుండఁ బ్రార్థించిరి. శకుంతలయు నతికష్టముతో లేచుటకుఁ బ్రయత్నిం చుచుండెను.

అప్పుడు రాజు శకుంతలను వారించుచు " రమణీమణీ ! నీవాయాసపడుచు లేవవలదు. నీదర్శనమాత్రముననే నాకు

సంతుష్టి యైనది. ఈస్థితిలో నీవు నాకతిథిసత్కారము చేయుట యుక్తముకాదు” అనియెను.)

అనసూయాప్రియంవదలు రాజును లతామండపమునం జంద్రకాంతశిలాతలమునం గూర్చుండుమని ప్రార్థించిరి. రాజును గూర్చుండెను. అప్పుడు శకుంతల సిగ్గుచే వివశయై తనలో “హృదయమా! నీవింతవఱకు నెవ్వనికొఱకుం దల్లడిల్లిపోవు చుంటివో యాతనిదర్శనము లభించినయిప్పుడీవిధముగా నేల సంకోచపడియెదవు?” అని ప్రబోధించుకొనియెను. అనసూయా ప్రియంవదలంగాంచి రాజు “మీసఖమణి యిప్పు డస్వస్థురాలై యున్నట్లు తోంచుచున్నది!” అనియెను. అనసూయాప్రియం వదలు నవ్వుచు “మహారాజా! ఇంక మాచెలికి స్వస్థత కలుగును” అని బదులు చెప్పిరి. శకుంతల తాలంగింపరాని సిగ్గుచేం దలవంచుకొనియెను.

అన—మహారాజా! రాజులు బహుభార్యాసేవితులై యుందురని వినుచుందుము. అట్టివారికందఱును బ్రియురాండ్రు కాంజాలరుగదా! అది కారణముగా మాకు మాసఖినిమిత్తమున మనస్తాపము కలుగకుండుంగాక!

రాజు—అనసూయా! నీవు చెప్పినమాట నిజమే. రాజు లకుం జాలమంది రాణు లుందురు! కాని నేను నిష్కపటహృద యముతోం జెప్పుచున్నాను. ఎట్లయినను సత్యముగా మీసఖి యే నాజీవనసర్వస్వము కాంగలదు.

ఆమాట కనసూయాప్రియంవదలు పరమానందకందళిత హృదయారవిందలై “ఇఁకమేము నిశ్చింతలమైతిమి. చరితార్థలమైతిమి!” అనిరి. అప్పుడు శకుంతల మృదులస్వరముతో “సఖులారా! నన్ను మహారాజునెదుటనుంచి యెన్నిమాటలంటిరి! ఈయపరాధమునకు క్షమాప్రార్థనముం గావింపుఁడు!” అనియెను. అనసూయాప్రియంవదలు నవ్వుచు “సఖీ! శకుంతలా! క్షమింపుమనుటకు మాకేమి? ఆసంశయ మెవ్వరికిఁ దోఁచినదో వారే యాపని చేయవలయును” అని బదులుచెప్పిరి.

శకుం—మహారాజా! మీపరోక్షమునఁగాని, సమక్షమునఁగాని మాసంభాషణమున నపచారము లేవియైన నున్నచో దయయుంచి మాయపరాధమును క్షమింపవలయునని ప్రార్థించుచున్నాను.

ఆమాటకు రాజు చిఱునవ్వు నవ్వెను. అంతఁ బ్రియంవద వెనుదిరిగి చూచి “సఖీ! అనసూయా! ఆలేఁడిపిల్ల తల్లికొఱకు వెదకుకొనుచు నిటునటుఁ దిరిగి చూచుచున్నది. పాపము! నేను పోయి దానిని దల్లియొద్దకుఁ జేర్చివచ్చెదను.” అనియెను. అప్పు డనసూయ “సఖీ! నీవొక్కతెవుగను బోవలదు. ఆలేఁడి పిల్ల చాలముదుకైనది. నీవొక్కతెవు దానిని బట్టుకొనఁజాలవు. నేనుగూడ వచ్చెదను” అని యాయిరువురును బయలుదేఱుటం గాంచి శకుంతల “సఖులారా! నన్నొంటిగ నిందువిడిచి యెచ్చటికిరువురును బోవుచున్నారా?” అనియెను. సఖులు నవ్వుచు

"ఈసమస్తభూమండలమునకు నధినాథుఁడగు జననాథుఁడు నీ చెంతనుండఁగా నీవేకాకిని వెళ్లుచున్నావు?" అని పలుకుచు మంద హాసముతో వారా లతామండపమునుండి బయలుదేఱి పోవు చుండిరి.

సఖులు పోవుటం గాంచి తత్తరపడుచున్న శకుంతలం గాంచి రాజు "సుందరీ! సఖులకొఱకై యింతయుత్కంఠపడియెద వేల? నీసఖిస్థానమున నేనుంటినిగాదా! ఏమికావలయునో యాజ్ఞాపింపుము! తత్క్షణమే నీయాజ్ఞ నెఱవేర్చెదను!" అనియెను.

"మహారాజా! మీరు పూజనీయులు! నిష్కారణముగా నీదుఃఖాత్మురాలి కపచారదోషముకూడ నేలకల్పింతురు?" అని పలుకుచు శకుంతల శయ్యనుండి లేచి బయలుదేఱుట కుపక్రమించెను. రాజామె నడ్డగించి "ఏమిది! ఈనీయవస్థయేమి! ఈగ్రీష్మాతపములో నీమధ్యాహ్నసమయమున నీలతామండపమునుండి వెడలుటయేమి! సరిసరి; కూరుచుండుము!" అని యామెచేయి పట్టుకొనియెను.

శకుం.—మహారాజా! వలదు వలదు! నాచేయివదలుము! నన్ను నాచెలులతోఁ బోనిమ్ము! నే నస్వతంత్రురాల నని నీవెఱుఁగవా?

రాజు లజ్జాసంకుచితుఁడై శకుంతలహస్తమునువదలివై చెను. అప్పుడు శకుంతల "మహారాజా! అవమానింపఁబడితి నని శంకించుచున్నారా? నేనేమిచేయఁగలను! నాయదృష్టమును

గూర్చి నిందించుకొనవలసియున్నది!'' అనియెను.

రాజు—అదృష్టమును దిరస్కరించుకొనుట యేల ?

శకుం—నాయదృష్టమును వేయిసారులైనను నిందించు కొనవలయును! అది నన్నుఁ బరాధీనురాలిగాఁ జేసినది చేసినట్లుండక పరగుణమోహితురాలిగాఁగూడ నేలచేయవలయును ? అని పలుకుచు వెడలిపోవుటకుద్యుక్తురాలయ్యెను. రాజుమరలశకుంతలపాణిగ్రహణముం గావించి యడ్డగించుకొనియెను. శకుంతల ,,మహారాజా! వదలుము! వదలుము! ఈతపోవనమున నిందందు మహర్షులు సంచరించుచుందురు!" అనియెను.

రాజు—రమణీమణీ! పెద్దలకొఱకింతగా భయపడియెద వేల? ఇదివఱకెంతమందిరాజర్షికన్యకలు గాంధర్వవిధానముచే న నురూపవరులను వరింపలేదు! అట్టివారు గురుజనామోదమును బడయుటలేదా? ఈసందర్భమున భగవానుఁడగు కణ్వమహర్షికిఁ గోపముగానియసంతుష్టిగానియెంతమాత్రమును గలుగఁజాలదు.

శకుం—మహారాజా! ఈసందర్శనసంభాషణముల వలనఁ గలిగినపరిచయమునుమాత్రము మఱవవలదు! దయయుంచుఁడు! పోయివచ్చెదను.

అని యామె చేయి వదలించుకొని పోవుచుండఁగా రాజు ,, సుందరీ ! నీవు నాచేయి వదలించుకొని నాయెదుటనుండి పోఁ గలవుగాని నాహృదయమును విడిచి యెట్లు పోఁగలవు ? '' అనియెను.

ఆమాట విని శకుంతల ,, అయ్యో! నాయడుగు జరుగుటలేదు! ఏమైననేమి! ఈచాటున దాఁగియుండి యాతనిహృదయమును బరీక్షించెదను '' అని యనుకొని యొకలతానికుంజము వెనుక దాఁగి నిరీక్షించుచుండెను.

రాజొంటిగా నాలతామండపమునఁ గూర్చుండి శకుంతల నుద్దేశించి ,,ప్రాణేశ్వరీ, నాకు నీహృదయము బోధపడుట లేదు. కాని నీవు నిర్దయురాలవై యొక్కసారిగా నన్నుఁ బరిత్యజించి పోవుటచే నీహృదయము వజ్రకఠినమైనదని బోధయగుచున్నది!'' అని యించుకసేపు మౌనముతోఁ గూర్చుండి పిమ్మట నొక్కనిట్టూర్పువిడిచి ,,ప్రియావిరహితంబగు నీలతామండపమునం గూర్చుండుటవలన నేమిఫలమున్నది ? '' అని యటనుండి లేచి వెలుపలికి వచ్చెను. అచ్చట నొకపచ్చికపట్టునందు శకుంతలమృణాలవలయము పడియుండెను, రాజు దానిం గాంచినతోడనే యొక్కయుదుటున దానినందుకొని పరమానందముతో వక్షోభాగమునం జేర్చుకొని కృతార్థుఁడ నై తిననిహర్షించుచు ,, ప్రియసీ ! ఈనీమృణాలవలయ మచేతనమయ్యును దుఃఖించుచున్న నాదుఃఖము నించుక శాంతింపఁజేసినది! కాని నీవట్లు కరుణింప లేకపోయితివిగదా ! '' అని సంతాపముతో నిందింప నారంభించెను.

శకుంతల యిఁక నిలువఁజాలక మృణాలవలయమును వెదకికొనుటకని నెపముకల్పించుకొని మరల లతామండపమునఁ

బ్రవేశించెను. రాజా మొంగాంచి హర్షసాగరనిమగ్నుఁడై ‹‹ ఇది గో! జీవితేశ్వరి మరలవచ్చినది! దేవతలు నాప్రార్థనలను మన్నించి సదయులై నాప్రాణేశ్వరినిఁ జూపియున్నారు! దప్పిచే నోరెండుకొనిపోవ జలమునకై పరితపించుచున్న చాతకము నోటఁ దొలుకరిమబ్బు వర్షబిందువును జిలుకరించినది!›› అని యానందించెను.

శకుంతల రాజునెదుటికిఁ బోయి ‹‹మహారాజా! త్రోవలో జ్ఞప్తికివచ్చినది. నామృణాలవలయ మిచ్చోటఁ బడిపోయినది. మీకు దొరకినచో దయచేసి నాకొసంగుఁడు!››అనియెను.

రాజ —‹‹రమణీమణీ! అది యేస్థలమునుండి జాఱి పడిపోయినదో దానిని మరల నాస్థలమునందు నేనుఁచుటకు సమ్మతింతువేని ఆవస్తువును నీకిచ్చెదను›› అనియెను. ఉపాయాంతరములేక శకుంతల యట్లు చేయుటకు సమ్మతించెను. అంతట రాజు ‹‹ ఇటురమ్ము! ఈశిలాఫలకమునఁ గూర్చుండి దానిని నీ కలంకరించెదను›› అనియెను. ఇరువురును గూర్చుండిరి. రాజా శకుంతలచేయి పట్టుకొని మృణాలవలయమును దొడుగుట కుద్యమించుచుండెను.

శకుంతల సమాకులహృదయముతో ‹‹ ఆర్యపుత్రా! త్వరపడుము! త్వరపడుము!›› అనియెను. రాజు శకుంతల తన్నుఁ గూర్చి ‹‹ఆర్యపుత్రా!›› యని సంబోధించుటకు మహానందమునంది ‹‹రమణీమణులు తమరమణులను మాత్రమే యిట్లు సంబో

ధింతురు—ఇప్పటికి నామనోరథము ఫలించినది!" అనుకొని ,, ప్రాణేశ్వరీ! ఈమృణాలవలయముముడి బిగిసికొనిపోయినది. నీకిష్టమైనచో మఱియొకవిధముగా దీనిని నీకలంకరించెదను"అని యెను. శకుంతల నవ్వుచు ,,మీచిత్తము!'' అనియెను.

పిమ్మట రాజేదో యొకమిష కల్పించుకొని యాలస్యము చేయుచు శకుంతలహస్తమున మృణాలవలయము నలంకరించు నెపంబునఁ దనయంగుళీయకము నామెకోమలకరాంగుళి నలంకరించి ,,సుందరీమణీ! ఇది యెంతయందముగానున్నదో చూడుము!'' అనియెను. శకుంతల ,,మహారాజా! ఎట్లుచూడఁగలను! కర్ణావతంసమగు కలువపూవునుండి పుప్పొడి చెదరి నాకన్నులలోఁ బడినది!'' అనియెను.

రాజు నవ్వుచు ,, ప్రియా ! భయము లేదు. నీవంగీకరించినచో నీకన్నులలో నూఁది పుప్పొడిని వదలించివైచెదను" అనియెను.

శకుం—అట్లయినచో మహోపకారమే—కాని, మీ యెడల నాకంతగా నమ్మకము లేదు.

రాజు—సుందరీ! అవిశ్వాసమునకుఁ గారణ మేమున్నది? క్రొత్తసేవకుఁడే ప్రభువు నానతి నతిక్రమించునా?

శకుం—ఈయతిభక్తియే యవిశ్వాసమునకుఁగారణము!

అంతట రాజు శకుంతల చుబుకమునను మస్తకమునను జేతులుంచి యామెవదనకమలము నించుకపైకెత్తెను. శకుంతల

శంకాప్రకంపితయై వలదువలదని రాజును నిషేధించుచుండెను. రాజు సందేహింపవలదని చెప్పి శకుంతల కనుదమ్ములయందు ఫూత్కారముం గావించెను.

కొంతసేపటికి శకుంతల "మహారాజా! మీకిక నాయాసపడనక్కఱలేదు. నాకన్నులిప్పు డెప్పటివలెనైనవి. సుఖముగా నున్నది. ఇంతటియుపకారముం గావించిన మీకు నేనెట్టి ప్రత్యుపకారము చేయఁగలను?" అనియెను.

రాజు—సుందరీ! ప్రత్యుపకారము నెవ్వరుకోరినారు! నేను నీవదనకమలపరిమళము నాఘ్రాణించితిని. అది నాపరిశ్రమకుఁ దగినపురస్కారముకాదా! కమలగంధాఘ్రాణమాత్రముననే మధుకరము సంతుష్టి నందఁగలదు.

శకుం—(నవ్వుచు) సంతోషించితి మని చెప్పక మఱియే మందురు?

ఈవిధముగా సంతోషసంభాషణము జరుగుచుండఁగా "ఓ చక్రవాకీ! రాత్రి యేతెంచుచున్నది. ఈసంగతి చక్రవాకునితోఁ దెలుపుము!" అనుమాటలు శకుంతలచెవులఁ బడియెను. శకుంతల యాసంకేతముం దెలిసికొని శంకాకులితస్వాంతయై "మహారాజా! పూజ్యురాలగు మామేనత్త గౌతమి నాయస్వస్థత నాలకించి నేనెట్లుంటినో పరామర్శించుటకై యిటకు వచ్చుచున్నది! ఈచక్రవాకవృత్తాంతవ్యాజముచే ననసూయాప్రియంవదలు నాకీసంగతిం దెలుపుచు జాగ్రత్తగా నుండుమని

నన్ను హెచ్చరించుచున్నారు! మీరు శీఘ్రముగ సీపొదరింటి చాటునకుఁ బోవలయును" అనియెను. రాజు "మంచిది. పునర్దర్శనమగుఁగాక!" అని చాటునకుఁ బోయి తదేకదృష్టితో శకుంతల నవలోకించుచుండెను.

కొన్ని నిమిషములకుఁ దరువాత శాంతిజలపరిపూర్ణంబగు కమండలువును హస్తమునం దాల్చి గౌతమి యాలతామండపమునఁ బ్రవేశించి శకుంతలయొడలిపైఁ జేయివైచి "అమ్మా! నీకనారోగ్యముగా నున్నట్లు వినియుంటిని. ఇప్పుడెట్లున్నది? కొంచెముపశమించినదా?" అని ప్రశ్నించెను. శకుంతల మృదుల స్వసముతో "ఇంచుక నెమ్మదిగనే యున్నది" అనియెను. అప్పుడు గౌతమి కమండలువునందలి శాంతిజలమును శకుంతల యొడ లంతటను జిలుకరించి "బిడ్డా! నిరోగిచిరాయుష్మతి నగుము!" అని యాశీర్వదించి యనసూయాప్రియంవద లచ్చోట లేకుండుటం గాంచి "తల్లీ! ఇంతజబ్బులో దగ్గఱ నెవ్వరును లేకుండ నీవొంటిగనే యున్నావా?" అనియెను.

శకుం — లేదు — నేనొంటిగా నుండలేదు. అనసూయాప్రియంవదలు నన్ను విడువకుండఁ గనిపెట్టుకొనియే యున్నారు. ఇప్పుడే వారు జలాహరణమునకై మాలినీతీరమునకుఁ బోయినారు.

గౌత — బిడ్డా! అపరాహ్ణమైపోయినది. కుటీరమునకుఁ బోవుదము రమ్ము!

ఉపాయాంతరము లేక శకుంతల యామె ననుసరించిపో యెను. ప్రాణేశ్వరీవిరహితంబగు నాలతామండపమునం దుండఁ జాలక రాజును శిబిరాభిముఖుఁడై వెడలిపోయెను.

---

## చతుర్థాంకము.

### ప్రథమదృశ్యము — దుర్వాసశాపము.

ఈరీతిగాఁ గొన్నిదినములు గడచినవి. తుట్టతుదకు రాజు శకుంతలను గాంధర్వవిధానమునఁ బెండ్లియాడి సంతోషము తోఁ గొన్నిదినము లాధర్మారణ్యమునందుండి పిమ్మటఁ దన రాజధానికిఁ బయనమై పోయెను.

ఒకనాఁ డనసూయ ప్రియంవదం బిలిచి "సఖీ! మన శకుంతల గాంధర్వవిధిచే ననురూపవరలాభముం గాంచినది. కాని రాజు నగరునకుం బోయి యంతఃపుర విలాసినులం గలిసికొని యావిలాసములలో మునిఁగి మనచెలిని మఱచిపోవునేమో యని నాకు భయమగుచున్నది!" అనియెను.

ప్రియం.—సఖీ! నీవట్లు సందేహింపనక్కఱలేదు. అంత టి దివ్యమోహనరూపము గుణశూన్యమైనది కాఁజాలదు. కాని తండ్రివచ్చి యీవృత్తాంతము నాలించి యేమనునో యని మాత్రము నాకు సంశయముగా నున్నది.

అన—చెలీ! ఇందువలన నాతనికిఁ గోపముగాని యసంతుష్టిగాని కలుగుటకుఁ గారణములేదు. ఇది యాతని కిష్టములేనిపనిగాదు. ఆమహాత్ముఁడు మొదటినుండియు గుణవంతుఁ డగు పాత్రునకుఁ గన్యాప్రదానముం గావింపవలయునని సంకల్పించుకొని యుండెను. ఆకోరిక దైవమే ఫలింపఁజేయుటచేఁ దానానాయాసముగఁ గృతార్థుఁడ నైతినని యాతఁడు సంతోషింపఁగలఁడు! ఎట్లు భావించినను నిది యాతని కనిష్టవిషయము కానేరదు.

ఇట్లు సంభాషించుకొనుచు వారు పర్ణశాల కించుక దూరమునఁ బూవులు గోసికొనుచుండిరి. అతిథి సేవాభారమును వహించియున్న శకుంతల యేకాకినియై కుటీరద్వారమునం దుపవిష్టయై యుండెను. అంతలో దుర్వాసమహాముని యచ్చటికి వచ్చుటయుఁ దదేకపతిధ్యాననిమగ్న యగు శకుంతల బాహ్యజ్ఞానశూన్యయై కేవలము నామహర్షి వచ్చినసంగతినే తెలిసికొనఁజాలకపోయెను. అందుచే దుర్వాసుఁడు శకుంతల తన్నుఁ బరాభవించిన దని యెంచి రోషావేశవివశుఁడై “పాపాత్మురాలా! నీవతిథి నవమానించితివి! నీవెవ్వ డెవ్వనిపై ధ్యానమంతయు నుంచి స్వధర్మమును మఱచి యతిథినగు నన్నుఁ బరాభవించితివో యాతఁ డెంత తెలిపినను నిన్ను మఱచిపోవుఁగాక!” అని శపించెను.

పూవులు గోయుచున్న ప్రియంవద యాతీవ్రవచనముల

నాలించి ,, అయ్యో ! అయ్యో ! ఎంతపనిజరిగినది ! శూన్య హృదయ యగు శకుంతల పూజనీయుఁడగు నేమహాత్మునియె డలనో యపరాధినియైనది ! ” అని యావంకకుఁ జూపులు సారించి ,, సఖీ ! అనసూయా ! ఆతఁడు మఱి యెవ్వఁడును గాఁడు! దుర్వాసమహర్షియే—ఆతనికి మాటిమాటికిని గోపమే ! చూడుము ! చూడుము ! రోషావేశముచేఁ దూలుచు నాతఁ డెట్లు పోవుచున్నాఁడో ! ” అనియెను.

అనసూయ ,, ప్రియంవదా ! వృథానిందనమువలన లాభమేమున్నదియో చెప్పుము ! సత్వరమపోయి యాతని పాదములఁ బట్టుకొని ప్రార్థించి యిటకుఁ దోడ్కొనిరమ్ము! నేనింతలో నాతని కర్ఘ్యపాద్యములను సంసిద్ధము చేసి యుంచెదను. ” అనియెను. అంతఁ బ్రియంవద యొక్కపరుగున దుర్వాసుని వెంబడించి పోయెను. అనసూయ పర్ణశాలకుఁ బోయెను.

అనసూయ యింకను గుటీరమును జేరకుండఁగనే ప్రియంవద యామెం గలిసికొని ,, సఖీ ! దుర్వాసుఁడు స్వభావము చేతనే కుటిలహృదయుఁడని నీ వెఱుంగవా ! ఆతఁడు ప్రార్థనావాక్యముల నాలకించునా ? అయినను నేననేకవిధములఁ బ్రార్థించి యాతని నించుక శాంతచిత్తునిం గావించితిని. ఎంతప్రార్థించినను నాతఁడు కుటీరమునకు వచ్చుట కంగీకరింపకుండుటచే నేనాతని పాదములపైఁబడి ,, మహాత్మా ! ఆమె నీబిడ్డ ! నీప్రభావము నెవ్వరు తెలిసికొనఁగలరు ? దయయుంచి యామెయప

శాపమును క్షమింపుము ! " అని ప్రార్థించితిని. అప్పు డాతఁడు నామాటకుఁ దిరుగులేదు. కాని యామె యేదేనొక యానవాలు చూపినచోఁ దోడనే శాపవిమోచనమై యాతనికి జ్ఞప్తి కలుగఁ గలదు ! ' అని యనుగ్రహించినాఁడు " అని చెప్పెను.

అన—సఖీ ! మంచిపనిజరిగినది. మనము ధైర్యముతో నుండుట కవకాశమున్నది. ఆమహారాజు స్వనామాంకితమగు నొకముద్రికను శకుంతల కోమలాంగుళి కలంకరించి యుండెను గదా ! శకుంతల శాపవిమోచనమున కదియొక యాధార మున్నది. రాజొకవేళ మఱచిపోయినను దనయుంగుళీయకముం జూచి జ్ఞప్తి తెచ్చుకొనఁగలఁడు.

అని యనుకొనుచు వారిరువురును బర్ణకుటీరమునకుఁ బోయి చూచిరి. అప్పుడు శకుంతల కరతలమునఁ గపోలము నుంచుకొని నిశ్చలయై ముద్రితనయనములతోఁ జిత్రప్రతిమ వలెఁ గూర్చుండి యుండెను. అప్పుడు ప్రియంవద " సఖీ ! అనసూయా ! చూడుము ! మన శకుంతల యింకను బతిధ్యానమునందే నిమగ్నయై యున్నది ! ఇట్టియీమె యతిథిసత్కారము నెట్లు నెఱవేర్పఁగలదు ? " అనియెను.

అన—చెలీ ప్రియంవదా ! ఈమాట మనమనసులోనే యుండవలయును. ఎప్పటికిని మఱియొకరికిఁ దెలియఁగూడదు. ఒకవేళ శకుంతల కీసంగతి యెంతమాత్రము తెలిసినను నామె జీవింపఁజాలదు.

ప్రియం — సఖీ! నీవేమిచ్చిదానవా? ఈసంగతి శకుంతల కెట్లు తెలియును? నవమాలికాలత నుష్ణజలముతోఁ దడుపుట కెవ్వరు సాహసింపఁగలరు ?



## ద్వితీయదృశ్యము. — పతిగృహయాత్ర.

కొన్నిదినములకుఁ గణ్వమహర్షి సోమతీర్థమునుండి యాశ్రమమునకు వచ్చెను. ఒకనాఁ డాతఁ డగ్నిగృహమునఁ బ్రవేశించి యగ్నికార్యములను నిర్వర్తించుకొనుచుండఁగా ,, ఓమహర్షిచంద్రమా! దుష్యంతమహారాజు వేఁటకై నీతపోవనమునకు వచ్చి శకుంతలాపాణిగ్రహణము గావించుకొని రాజధానికి వెడలిపోయినాఁడు! తత్సంయోగముచే నిప్పుడు శకుంతల గర్భవతియైయున్నది” అని యొకయశరీరవాక్కు కణ్వునకు శ్రవణగోచరమయ్యెను. ఈవిధముగా శకుంతల తన కించుకంతయుఁ దెలుపకుండ స్వతంత్రముగ వివాహముచేసికొన్నందుకుఁ గణ్వునకుఁ గోపముగాని యసంతుష్టిగాని యెంతమాత్రమును గలుగకుండుటయేకాక యాతఁ డాశుభవాక్యశ్రవణముచేఁ బరమానందసాగరనిమగ్నుఁడై ,,ఆహా! నేనెంతటి యదృష్టవంతుఁడను! శకుంతల యిటువంటి యనురూపవరుని వరించినది!” అని యనుకొని యానందవికసితవదనముతో శకుంతలయొద్దకుఁ బోయి

తనసంతోషమును బ్రదర్శించుచు „బిడ్డా! నీపరిణయవృత్తాంతము దెలిసికొని నేననిర్వచనీయానందము ననుభవించుచున్నాను. ఇఁక నేనెంతమాత్రము నాలస్యము చేయకుండ నిరువురుశిష్యులను గౌతమిని దోడిచ్చి నిన్నత్తవారింటికిఁ బంపెదను.” అనిచెప్పి శకుంతలాప్రయాణమునకు వలయుప్రయత్నములం గావించుచుండెను.

ప్రయాణముహూర్తము సమీపించినది. గౌతమియును శార్ఙ్గరవశారద్వతులను నిరువురుశిష్యులును శకుంతలతోఁ గలసి రాజధానికిఁ బోవుటకు సంసిద్ధులైయుండిరి. అనసూయాప్రియంవదలు శకుంతలను యథోచితముగ నలంకరించిరి. కణ్వమహర్షి శోకాకులహృదయుఁడై „ఇప్పుడు శకుంతల యత్తవారింటికిఁ బోవుచుండుటంగాంచి నాహృదయము తల్లడిల్లిపోవుచున్నది. నయనము లనవరతబాష్పధారాపరిపూర్ణము లగుచున్నవి. కంఠము రుద్ధమై నోటమాటరాకుండఁ బోవుచున్నది. నాసర్వావయవములును నిశ్చేష్టములై పోవుచున్నవి. ఇదియేమి! వనవాసిని దపస్విని నగునాకే యించుక పెంచినంతమాత్రమున నింతటి దుఃఖముగలుగుచుండఁగా నిజముగా సంసారులగువారికిఁ దమ కన్నబిడ్డల నత్తవారింటికిఁ బంపునప్పు డెంతటిదుఃఖముకలుగునోకదా! తెలిసినది! ప్రేమయనునది యతివిషమంబగువస్తువు!” అనిభావించుకొని కొంతసేపటికి శోకవేగము నుపశమింపఁజేసికొని శకుంతలంగాంచి „తల్లీ! ముహూర్తము సమీపించినది. ప్రయాణ

మగుము! ఊరక కాలహరణ మేలచేసెదవు?" అని తపోవన వృక్షములంగాంచి గద్గదస్వరముతో "ఓసమీపతపోవనభూరుహములారా! ఎవ్వతె యెన్నఁడును మీకు నీరుపోయకుండఁ దాను జలపానము చేయలేదో, యెవ్వతె యలంకారప్రియ యయ్యును మీయందలి ప్రేమగల దగుటచే మీచిగురాకు నైనను జిదుముటకు సాహసింపఁజాలక పోయెడిదో, యెవ్వతె మీ కుసుమప్రసవసమయమున నపారానందమున మునిఁగి తేలుచుండెడిదో యట్టిప్రేమమయి యగుశకుంతల యిప్పుడు మిమ్ముల విడిచి యత్తవారింటికిఁ బోవుచున్నది! మీరందఱు నీమె కనుజ్ఞ నొసంగవలయును!" అనియెను.

పిమ్మట నందఱును లేచిరి. శకుంతల పెద్దలకందఱకును నమస్కరించి ప్రియంవదయొద్దకుఁ బోయి బాష్పపూరితనయనయై "సఖీ! ఆర్యపుత్రుని జూడవలయునని నాచిత్తము వేగిరపడుచున్నమాట సత్యమే—కాని యీతపోవనమును విడుచుటకు నాయడుగులు జరగుట లేదు." అనియెను.

ప్రియం—సఖీ! నీవే యిట్లుండుట లేదు. ఈతపోవనము కూడ నీవియోగమును సహింపక యెట్లున్నదో చూడుము! నిరానందముతో జీవమాత్రావశిష్టమై యున్నది. ఇందలి హరిణీహరిణము లాహారవిహారముల నుజ్జగించి చిత్రప్రతిమలవలె నిలిచి యున్నవి. మేయుచుమేయుచున్న తృణాంకురములు వానినోళ్ళ నుండి జారి పడిపోవుచున్నవి. మయూరీమయూరములు తమ

ఘనానందనృత్యములను మాని మెడలెత్తి తదేకదృష్టితో నీవం
కఁ జూచుచున్నవి! కోకిలలు సహకారముకుళరసాస్వాదనవిము
ఖములై నిశ్శబ్దముగఁ గూరుచున్నవి! మధుకరీమధుకరములు
తమమధురషడ్జగానమునకు స్వస్తి చెప్పి మధుపానమునం దాసక్తి
విడిచి నిశ్చేష్టములై యున్నవి!

కణ్వ—తల్లీ! ఇఁక నాలస్య మేమున్నది! శుభముహూ
ర్తము సమీపించినది.

శకుంతల ,, తండ్రీ! నావనతోషిణిని బలుకరింపకుండ
నేను వెడలఁజాలను.'' అని చెప్పి వనతోషిణియొద్దకుఁ బోయి
,,సోదరీ! వనతోషిణీ! ప్రేమమయివగునీవు నీశాఖాబాహువు
లతో నన్నొక్కసారి కౌఁగిలించుకొనుము!'' అని యనసూయా
ప్రియంవదలం గాంచి ,,సఖులారా! ఈనావనతోషిణిని నేను
మీచేతులలోఁ బెట్టి యొప్పగించుచున్నాను'' అనియెను. అన
సూయాప్రియంవదలు ,,సఖీ! శకుంతలా! మమ్ముల నెవ్వరి
కొప్పగించిపోయెదవు?'' అని యాఁపజాలనిశోకముచే దుఃఖింప
నారంభించిరి. అప్పుడు కణ్వమహర్షి ,,అనసూయా! ప్రియంవదా!
మీ కేమి మతిపోయినదా? ఈసమయమున శకుంతలకు ధైర్యము
చెప్పి యూఱడింపవలసినవారు మీరే యిట్లు దుఃఖించుట కా
రంభించితిరా?'' అని ముదలించెను.

అప్పుడు సంపూర్ణగర్భిణియగునొక హరిణి పర్ణకుటీర
ప్రాంతమున శయనించి యుండెను. శకుంతల దానివైపుఁ జూ

డ్యులఁ బరగించుచు ,,నాయనగారూ! ఈహరిణి నిరంతరాయముగ సుఖప్రసవమైనతోడనే నాకాసంతోషవార్త తెలియఁజేయవలయును. మఱచిపోయెదరేమో సుమా!" అనియెను. కణ్వుఁడు మృదుస్వరముతో ,,బిడ్డా! తత్క్షణమే నీకుఁ దెలియఁజేసెదను. ఎన్నఁటికిని మఱచిపోను" అనియెను.

కొన్నియడుగులు నడచినతరువాత శకుంతల ,,నాపైఁట చెఱఁగెవ్వరో పట్టిలాగుచున్నారు!" అని వెనుకకుఁ దిరిగి చూచెను. అప్పుడు కణ్వుఁడు ,,తల్లీ! దీనితల్లి మరణించినప్పటినుండియు నీవు దీనిని దల్లివలెఁ బెంచితివి. దీనియాహారముకొఱకు నీవు నిరంతరమును శ్యామాకసమాహరణముం గావించుచుంటివి. దీనికొకప్పుడు వదనమునఁ గుశాంకురము గ్రుచ్చుకొనుటచే గారనూనెరాచి దీనిగాయమును మాన్పితివి. అట్టి మాతృహీనయగు నీ హరిణశిశువే నిన్నుఁ బోవలదని యత్నించుచున్నది." అనియెను.

శకుంతల దానివీఁపుపైఁ జేయివైచి దువ్వుచు ,,బిడ్డా! ఇంకను నన్నేల వెంబడించెదవు? నేను నిన్ను విడిచి పోవుచున్నాను. నీవింటికి మరలిపొమ్ము! తల్లిలేనిబిడ్డను నిన్నింతవఱకును బెంచితిని. ఇఁక నేఁబోయెదను. ఇంతటినుండి తండ్రిగారే నీకు రక్షకులు" అని దుఃఖించుచు నడచుచుండెను. అప్పుడు కణ్వుఁడు ,,వత్సా! ఊఱడిల్లు మూఱడిల్లుము! కన్నీటిచే మార్గ మగపడకుండుటచే మిట్టపల్లములుగల యీనేలపైఁ బా

దముల కాఘాతములు కాఁగలవు" అనియెను.

ఈవిధముగాఁ బ్రయాణమున కాలస్యమైపోవుచుండు టచే శార్ఙ్గరవుఁడు కణ్వమహామునిం గాంచి "మహాత్మా! మీ రింకను దూరముగ వచ్చుటవలనఁ బ్రయోజనము లేదు. మీ రుపదేశింపవలసినసంగతు లిచ్చటనే యుపదేశించి యాశ్రమము నకు వేంచేయుదురుగాక!" అనియెను. కణ్వుఁడు "అట్లయిన చో నీపాలచెట్టునీడ నించుకసేపు నిలుతము!" అనుటయు నందఱు నచ్చట నాఁగిరి. అప్పుడు కణ్వుఁ డించుక యాలో చించి శార్ఙ్గరవునిం జూచి "వత్సా! నీవు శకుంతలను రాజసము ఖమునం దుంచి యాతనికి నాయీయాదేశముం దెలుపుము—

"రాజా! మేమాటవికులము! తపస్సుచేతనే కాలయాపనము చేసికొనుచుందుము! నీవత్యుత్తమవంశమున జన్మించితివి. మా శకుంతల తనబంధువుల కెవ్వరికిని దెలుపకుండఁగనే స్వయముగ నిన్నుఁ బ్రేమించినది. ఇదియంతయు బాగుగ నాలోచించికొని నీయితరసహధర్మిణులలో నీశకుంతలను గూడఁ గృపాదృష్టితోఁ గటాక్షించి చేర్చుకొనుము! ఇదియే నాప్రార్థనము!—"

ఈవిధముగాఁ దనమాటలను రాజునకు విన్నవింపుమని చెప్పి మహర్షి శకుంతలంగాంచి "తల్లీ! ఇప్పుడు నీకించుక యుపదేశింపవలసియున్నది. నేనడవివాఁడనే గాని లోకవృత్తాం తము నించుకంతయైన నెఱుంగనివాఁడను గాను. నీవు భర్తృ ఘృదిరముమనకుఁ బోయి పెద్దలసేవ యాచరింపుము! సపత్నులను

సఖులుగాఁ జేసికొనుము! పరిచారికలయెడల దయాకలితవై మెలంగుము! సౌభాగ్యమునకు గర్వింపకుము! స్వామి యించుక కాఠిన్యమును బ్రదర్శించినప్పటికైనను రోషవివశవై ప్రతికూలముగ సంచరింపకుము! ఈవిధముగ మెలంగిన మహిళామణియే గృహిణీపదమునఁ బతివ్రతగాఁ బరిగణింపఁబడును. కాదేని కులకంటకురా లగును. " అని బోధించెను.

తరువాత గౌతమి " అమ్మా! వధూగణమున కింతకంటె బోధింపవలసిన దేదియును లేదు. తల్లీ " తండ్రి చెప్పినమాటల నన్నిఁటిని మనసునం దుంచుకొనుము! " అనియెను.

ఇట్లుపదేశించినతరువాతఁ గణ్వుఁడు శకుంతలం గాంచి " అమ్మా! మేము చాలదూరము వచ్చితిమి. ఇఁక మరలిపో యెదము.నన్నును నీసఖులను నొక్కసారి కౌఁగిలించుకొని సెలవొసంగుము!" అనుటయు శకుంతల బాష్పపూరితనయనములతో " తండ్రి! అనసూయాప్రియంవదలుకూడ నిచ్చోట నుండియే తిరిగిపోయెదరా? వీరినిగూడ నాతోఁ బంపరా?" అనియెను. కణ్వుఁడు " బిడ్డా! వీరెట్లు వచ్చెదరు? వీరి కింకను బెండ్లి కాలేదు. కావున వీరుకూడ నచ్చటికి వచ్చుట బాగుగ నుండదు. గౌతమి నీతో రాఁగలదు." అనియెను. శకుంతల తండ్రిని గౌఁగిలించుకొని గద్గదస్వరముతో " తండ్రీ! నిన్నుఁ జూడకుండ నచ్చట నేనెట్లు ప్రాణములతో నుండఁగలను?" అనుచుండఁగనే యామె కన్నీరు మున్నీరైపోయెను. కణ్వుఁడు

ను బాష్పపూరితనయనుఁడై ‘‘ తల్లీ ! నీవత్తవారింటికిఁ బోయి గృహిణీపదమునఁ బ్రతిష్ఠితవై సాంసారికవ్యాపారములయందు నిరంతరమును మగ్నురాలవై నప్పుడు నీకు నావియోగమువలనఁ గలిగినవిచారము ననుభవించుట కవకాశమే యుండదు. ’’ అని యూఱడించెను.

శకుంతల తండ్రి పాదములపై వ్రాలి ‘‘ తండ్రీ ! నాకు మరల నెన్నాళ్ళ కీతపోవనదర్శనము లభియించును ? ’’ అనియెను. కణ్వుఁడు ‘‘ బిడ్డా ! ఈససాగరధరామండలమున కేకచ్ఛత్రాధిపతియగు దుష్యంతసార్వభౌమున కర్ధాంగలక్ష్మివగు నీవు నిరతిశయప్రభావుఁడగు నీతనయుని సింహాసనమునం దుంచి సమస్త సామ్రాజ్యభారము నాతనిచేతుల కొప్పగించి పిమ్మట నీభర్తతోఁగూడ శాంతరసాస్పదం బగు నీతపోవనమునకు మరల రాఁగలవు. ’’ అనియెను.

ఈవిధముగ శోకాకులయగు శకుంతలం గాంచి గౌతమి ‘‘ తల్లీ ! ఏలవిచారించెదవు ? ఊఱడిల్లుము ! ప్రయాణసమయమైనది. సఖులతోఁ జెప్పవలసినమాటలు చెప్పి సెలవందికొని బయలుదేఱుము ! ఆలస్యము చేయవలదు ’’ అనియెను. శకుంతల సఖులయొద్దకుఁ బోయి ‘‘ చెలులారా! మీరిరువురు నేకకాలమునందె నన్నొకసారి కౌఁగిలించుకొనుఁడు ! ’’ అనియెను. అట్లే యనసూయాప్రియంవద లామె నాలింగనము చేసికొనిరి. ముమ్వురకు దుఃఖము పొంగిపొరలి వచ్చుచుండెను. కొంతసేప

లికి సఖులు శకుంతలం గాంచి "ప్రియసఖి! ఒకవేళ రాజు శీఘ్రముగ నిన్నానవాలు పట్టఁజాలకపోయినచో నాతని పేరు ముద్రింపఁబడియున్న యంగుళీయకమును జూపింపుము." అని బోధించిరి. శకుంతల యామాట విని యదరిపడి "సఖులారా! మీరిట్లనుచుంటిరేమి? మీయీసంశయ మేల కలుగవలయును? మీ మాటవలన నాహృదయము చలించిపోవుచున్నది." అనియెను. అనసూయాప్రియంవదలు "సఖి! శకుంతలా! ప్రేమస్వభావమే యిట్లులుండును. ప్రేమగలచోటనే యకారణముగ ననిష్టశంక కలుగుచుండును" అని చెప్పిరి.

ఈవిధముగా నందఱియొద్దను సెలవులందికొని శకుంతల గౌతమీపరిభృతులతో దుష్యంతరాజధానికిఁ బ్రయాణమయ్యెను. కణ్వుఁడును, ననసూయాప్రియంవదలును గంటికిగిపడుచున్నంతవఱకుఁ దదేకదృష్టితో శకుంతలవంకఁ జూచుచుండిరి. క్రమముగా శకుంతల యగపడకుండుటచే ననసూయాప్రియంవదలు పెద్దపెట్టున రోదనము చేయనారంభించిరి. మహర్షియగుకణ్వుఁడును దీర్ఘనిశ్వాసమును విడిచి "తల్లీ! అనసూయా! ప్రియంవదా! మీసహచరి వెడలిపోయినది. మీరింక శోకావేగము నడంచుకొని నాతోఁగూడ నాశ్రమమునకు రండు!" అని చెప్పి వారిని వెంటఁబెట్టుకొని యాశ్రమాభిముఖుఁడై పోవుచుఁ దన లో "దాచుకొన్నధనము దాచుకొన్నవానికి మరల నొప్పగించి నిశ్చింతుఁడై యున్నవానింబోలి నేనిప్పుడు శకుంతలను సత్పా

రింటికిఁ బంపి నిశ్చింతుఁడనై స్వస్థచిత్తుఁడ నైతిని" అని సహా ధానహృదయుఁ డయ్యెను.

---

పంచమాంకము.

ప్రథమదృశ్యము—దుష్యంతుఁడు,

ఒకనాఁడు దుష్యంతమహారాజు రాజకార్యములందీర్చి యేకాంతముగ నుండి ప్రియవయస్యుఁ డగుమాధవ్యునితోవిలా ససంభాషణములవలనఁ గాలక్షేపము చేయుచుండఁగా హంస పదిక యనుపరిచారిక సంగీతశాలనుండి మధురస్వరముతో నీ క్రిందిగీతమును బాడెను.

గున్నమామిడిఁజేరి ♦ క్రొన్ననగుత్తిఁ
గ్రొంబూవుదేనియఁ ♦ గ్రోల నాసించి
కపటప్రణయనాటకంబాడి తిరిగి
వేడుకపడి తమ్మి ♦ విరిపజ్జకరిగి
సురభిమరందంబు ♦ చూరాడిసాగసి
మఱితొంటిమాటయే ♦ మఱచిపోయితివి
మధుకరా! యిది నీకు ♦ మరియాదఁటయ్య ?

ఆగీతము నాలకించి రా జాకస్మికముగ నుద్విగ్నహృద

యుఁడై పోయెను. కాని యెందుకొఱకట్టిభావము కలిగెనో యా తనికించుకంతయును బోధపడలేదు. ఆతఁడు తనలో ‚‚ఈమనోహరగీతశ్రవణముచే నామన మింతయాకులపడుటకుఁ గారణమేమి? ప్రియజనవిరహమునఁగాని యింతటియాకులపాటు కలుగదు. ఇప్పుడు నాకట్టిదేదియును తటస్థించి యుండలేదు. సర్వవిధములసుఖులై యుండువారుకూడ రమణీయవస్తువును దర్శించినప్పుడుగాని,మనోహరగీతము నాలకించినప్పుడుగాని యాకులహృదయు లగుచుండుటకుఁ గారణమేదియో జన్మాంతరముసందలి స్థిరస్నేహ మస్పష్టముగ స్మృతిపథమునకుఁ దోఁచుటయే యైయుండవచ్చును'' అని యీవిధముగఁ దర్కించుకొనుచుండఁగా గంచుకి వచ్చి చేతులు జోడించి నిలువఁబడి ‚‚మహారాజా! ధర్మారణ్యవాస్తవ్యులగు మునికుమారులు మహాత్ముఁడగు కణ్వునిసందేశమును విన్నవించుటకై దయచేసి యున్నారు. ఏమియాజ్ఞ!" అని తెలియఁజేసెను.

రాజు తపస్వినామశ్రవణమాత్రముననే పరమాదరముం జూపుచు ‚‚నీవు శీఘ్రముగఁ బోయి యుపాధ్యాయుఁడగు సోమరాతునితో నభ్యాగతులగు తపస్వులను వేదవిధివిధానమున సత్కరించి స్వయముగ వారిని నాయొద్దకుఁ దీసికొని రావలయునని చెప్పుము! ఇంతలో నేనును దపస్విసందర్శనయోగ్యంబగు ప్రదేశమున యథావిధిగ నుపవసించి నిరీక్షించుచుండెదను" అని యాజ్ఞాపించెను.

## ద్వితీయదృశ్యము—ప్రత్యాఖ్యానము.

ఇట్లుచెప్పి కంచుకిని బంపి వైచినతరువాత రాజగ్నిగృహమునఁ బ్రవేశించి "భగవానుఁడగు కణ్వుఁ డీమునికుమారులను నాయొద్దకుఁ బంపుటకుఁ గారణ మేమైయుండును? ఆతని తపస్సునకేమైన విఘ్నములు కలుగుచుండెనా? కాక యేదుష్టాత్ములైన ధర్మాశ్రమమునం దత్యాచారములఁ గావించుచుండిరా? ఏదియుఁ దెలియక నాహృదయము కలఁగిపోవుచున్నది." అని యనుకొనుచుండఁగాఁ జెంతనున్న పరిచారిక "మహాప్రభూ! ప్రభువారియధికారమునఁ దపోవనములయం దెట్టిబాధలును లేక తపస్వులయనుష్ఠానములు నిర్విఘ్నముగ జరుగుచుండుటచే సనుగ్రహించి యందఱిమహర్షులు మిమ్మాశీర్వదించుటకై వచ్చియుందురని తలంచెదను" అనియెను.

ఇంతలో సోమరాతుఁడు ఋషులతోఁ గూడ నగ్నిగృహమునఁ బ్రవేశించెను. రాజు దూరమునుండియే చూచి పీఠమునుండిలేచి వారి యాగమనమును నిరీక్షించుచు వినయవినమితుఁడై నిలిచియుండెను. అప్పుడు సోమరాతుఁడు తపస్వులం గాంచి "అదిగో! చతుస్సముద్రపర్యంతధరామండలమున కేకచ్ఛత్రాధిపతియగు సార్వభౌముఁడు మీరాకకొఱ కెదురు చూచుచున్నాఁడు చూచితిరా!" అనియెను.

అప్పుడు శార్ఙ్గరవుఁడు పరమానందముతో "ఇంతటి వినయమును సౌజన్యమునుగల యీమహారాజును గాంచుటచే

మహానందము గుటయే కాక సాధువాదములతోఁ బ్రశంసింపవల యునని తోఁచుచున్నది! ఇందు విచిత్రమేమున్నది! పరిణతఫల భూరుహములు వినమితములే యైయుండును. వర్షాకాలజలధర ములు వారిభారముచే వినమ్రభావమునే యవలంబించియుం డును. ఎంతశక్తి యున్నను నంత నమ్రతకూడ కలిగియుండుటయే సత్పురుషుల స్వభావము!" అనియెను.

అప్పుడు శకుంతల కుడికన్నదరెను. అందుచే నామె చింతాకులహృదయముతో గౌతమిం గాంచి "అత్తా! ఇప్పుడేల నాకుడికన్ను దరుచున్నదేమి?" అనియెను. గౌతమి "బిడ్డా! పట్టియనుమానములు మనసునఁ బెట్టుకొనవలదు. నీపతికులదేవతలు నీకు సర్వశుభములను బ్రసాదించెదరుకాక!" అని యూఱడించెను. ఎట్లయినను శకుంతల యదిమొదలుగ మనసులో ననేకవిధములగు దర్కవితర్కములు చేసికొనుచు నతి వికలహృదయముతోఁ బరితపించుచునే యుండెను.

మహారాజు శకుంతలం గాంచి "అవకుంఠనవతి యగు నీయువతి యెవ్వతె? ఈమునికుమారులతో నీమె యిచ్చోటి కేల వచ్చినది?" అనియెను. అప్పుడు పార్శ్వవర్తిని యగు పరిచారిక "మహాప్రభూ! చూచినప్పటినుండియు నేనుగూడ నిదే యాలోచించుచున్నాను. కాని యేమియును బోధపడ లేదు. ఏమైననేమి! మహారాజా! ఇటువంటి మధురరూపలావణ్యవతి యగు సతీమణి నిదివఱ కెవ్వరు నెన్నఁడును జూచియుండరు"

అనియెను. తోడనే మహారాజు “ఇఁక నావిషయమున మా టాడకుము! పరయువతులం గన్నెత్తి చూచుటయును, వారి వృత్తాంతముల నాలకించుటయును ధర్మబద్ధులగువారికిఁ దగిన పనులు గావు” అనియెను. శకుంతల యామాట నాలించి పరి తపించుచు పోవుచున్న తనహృదయము నుద్దేశించి “హృదయమా! ఏల యింత యాకులపడియెదవు? ఆర్యపుత్రుని పూర్వప్రేమ భావముం దలంచుకొని యూఱడిల్లి ధైర్యము నవలంబించి యుండుము!” అని హెచ్చరించుకొనియెను.

తపస్విలు క్రమముగ సమీపించి మహారాజునకు జయ మగుఁగాక యని చేతులెత్తి యాశీర్వదించిరి. రాజు వారికి నమ స్కరించి పీఠములపైఁ గూర్చుండవలయు నని ప్రార్థించెను. అందఱు నాసీను లైనతరువాత రాజు “మహాత్ములారా! మీ తపస్సులు నిర్విఘ్నముగఁ గొనసాగుచున్నవా?” అని కుశల ప్రశ్నముం గావించెను.

మునికుమారులు—మహారాజా! నీవు శాసనకర్త వై యుండఁగా ధర్మక్రియల కంతరాయములు కూడునా? సూర్యుఁ డుదయించియుండఁగా నంధకారావిర్భావమున కవకాశ మెక్కడిది?

రాజు—ఇప్పటికి నారాజశబ్దము సార్థక మైనది. మహా త్ముఁడగు కణ్వమహర్షి క్షేమముగ నున్నాఁడా?

ముని—ఆ! ఎల్లవిధముల నామహాత్ముఁడు కుశలియే.

ఈవిధముగాఁ బ్రథమసమాగమసముచితంబు లగు శిష్టా
చారపరంపరలన్నియు నైనతరువాత శార్ఙ్గరవుఁడు మహారాజా!
మేము మాగురుదేవుని సందేశమును గొనివచ్చితిమి. దయతో
దేవర యాలకింపవలయును. మాగురువుగా రిట్లు చెప్పినా
రు:—,, మహారాజా! నాకుఁ దెలియకుండఁగనే నీవు నా కొ
మార్తెను బెండ్లియాడితివి. నాకంతయుఁ దెలిసినతరువాత నీవి
షయమున సంపూర్ణముగ సమ్మతించితిని. నీ వెల్లవిధముల
శకుంతలకుఁ దగినవరుఁడవు. కావున నిప్పు డీయంతఃసత్వ యగు
నీసహధర్మిణిని బరిగ్రహింపుము!—" అనియెను.

అప్పుడు గౌతమి ,, మహారాజా! నేనుఁగూడ నించుక
మనవిచేయఁదలఁచి యున్నాను. కాని యెట్లు చెప్పవలయునో
తోఁచుటలేదు. మాశకుంతల పెద్దల యానతి నిరీక్షింపకయె
నిన్ను వరించినది. నీవైనను నామె కావిషయముం గూర్చి బో
ధింపకయే పాణిగ్రహణముం గావించితివి. పరస్పరానురాగ
ముచే నిరువురును సమ్మతించి గావించిన కార్యవిషయంబున
నితరులు చెప్పవలసిన దేమున్నది?" అనియెను.

శకుంతల శంకాకంపితహృదయముతో ,, ఆర్యపుత్రుఁ
డిప్పు డేమి చెప్పునో బోధపడుటలేదు." అని తల్లడిల్లుచుండెను.
దుర్వాసశాపముచే రాజునకు శకుంతలాపరిణయవృత్తాంతము
విస్మృతమైపోవుటచే దుష్యంతుఁ డామాట లాలించి విస్మయా
పన్నహృదయముతో ,, ఇదియేమి! యిట్లనుచున్నారు?"

అనియెను. శకుంతల యామాటవిని నిలువున నిశ్చేష్టయై పోయెను. అప్పుడు శార్ఙ్గరవుఁడు "మహారాజా! లోకవ్యవహారములన్నింటినిందీర్చు నేర్పుగల మీరే యిట్లనుచున్నారేమి? వివాహితయగు వధు వెంతటిసాధుశీలయైనను నిరంతర పితృగృహవాసినియే యైయున్నచో లోకు లనేకవిధముల ననుకొందురు. ఈసంగతి మీకుఁ దెలియనిదా? అందుచేతనే మహాత్ముఁ డగు కణ్వుఁడు తనకిది యెంతకష్టముగ నున్నను సహించి యీశకుంతలను బతికులవాసినిఁగాఁ జేయుటకు నిశ్చయించినాఁడు!" అనియెను.

రాజు—ఏమిది? నే నీమె పాణిగ్రహణముం గావించి యుండలేదు.

శకుంతల నిలువున నీరై దుఃఖసాగరనిమగ్నయై తనలో "హృదయమా! నీవెంతగా శంకించుచుంటివో యంతయు జరిగినది." అని దిగులుపడుచుండెను. రాజిట్లు తన యసమ్మతిం దెలుపుట నాలకించి యాతని ధూర్తత్వమునకు శార్ఙ్గరవుఁడు మిగులఁ గోపించి "రాజా! జగదీశ్వరుఁడు నిన్ను ధర్మసంస్థాపనము చేయుటకై నియోగించియున్నాఁడు. అందుచే నేనిప్పుడు నిన్నడుగుచున్నాను. నీవు రాజవై యుండియు విధాయక కార్యానుష్ఠానమును విడిచి కేవలమును ధర్మద్రోహివై పోయితివే!" అనియెను.

రాజు—మహాత్మా! మీరు నన్నింతటి ప్రమత్తునిగా నేల భావించెదరు?

శార్ఙ్ఞ—రాజా! ఇది నాతప్పుగాదు. ఐశ్వర్యమదోన్మత్తు లగు వారిచర్య లన్నియు నిట్లే యుండును.

రాజు—మీరు నన్నన్యాయముగ నిందించుచున్నారు. నేనెన్నఁటికి నట్టినిందనీయుఁడను గాఁజాలను.

ఇట్లు తనయంగీకారముం దెలుపుచున్న మహారాజును, లజ్జావనతవదనయై యున్న శకుంతలను గాంచి గౌతమి ,, బిడ్డా! శకుంతలా! ఇంకను సిగ్గుపడుటవలన లాభములేదు. తల్లీ! ఇప్పుడు నేను నీమేలిముసుఁగు తీసివైచెదను. అట్లు చేసినచో నప్పుడైన మహారాజు నిన్నానవాలుపట్టఁగలుగునేమో!'' అని పలుకుచు శకుంతల యవగుంఠనమును దొలఁగించివైచెను. రా జప్పటికిని నానవాలుపట్టలేదు సరికదా పూర్వపక్షముసేయుట కనేకసంశయములు కలవాఁడై మౌనము నవలంబించియుండెను.

శార్ఙ్ఞ—రాజా! ఏమియుమాటాడ కట్లూరకుండెదవేల?

రాజు—మహాత్మా! ఏమిచేయుదును? అనేకవిధముల నాలోచించిచూచితిని. కాని యీమెను బెండ్లియాడినట్లు నా కెంతమాత్రమును జ్ఞప్తికి వచ్చుటలేదు. కేవల మీమెను భార్యగా నేనెట్లు స్వీకరింపఁగలను? ఇంతేకాక, యీమె యి ప్పుడు గర్భవతియైకూడ నున్నదే!

రాజిట్లు పలుకుటచే శకుంతల హతాశయై ,,అయ్యో!

ఎంతమాటపుట్టినది! ఒక్కసారిగాఁ బెండ్లిమాటయే సందేహ మా? రాజమహిషినై యెన్నియోసుఖముల ననుభవింపవలయు నని యెంతయో యాశపడియుంటినే? ఆయాశయంతయు నిప్పు డొక్కసారిగా నిర్మూలమై పోవలసినదేనా?" అని యాలోచిం చుకొనుచుఁ దల్లడపడిపోవుచుండెను.

అప్పుడు శార్ఙ్గరవుఁడు "మహారాజా! మహర్షియగు కణ్వుఁ డెంతటిమహానుభావుఁడో బాగుగ నాలోచించుకొను ము! ఆమహానుభావుఁ డాశ్రమమున లేనప్పు డాతని తనయ నాతనియనుమతియైన లేకుండఁ బెండ్లియాడితివి. అట్లు కావించి నను నీపై నాతఁడు కోపగింపలేదు; అసంతుష్టుఁడు కాలేదు; పరమానందమునుబ్రదర్శించుచుఁ దనతనయయగు నీసహధర్మిణిని నీయొద్దకుఁ బంపించినాఁడు. అంతటిమహానుభావుని యీదేశ మున కభ్యంతరముం గల్పించి యీవిధముగా నాతని నవమా నించుట నీవంటిమహారాజునకు యుక్తముకాదు. స్థిరహృదయ ముతో నాలోచించుకొని కర్తవ్యమును నిశ్చయించుకొనుము!" అనియెను.

అప్పు డంతకంటెను సముద్ధతస్వభావుఁడగు శారద్వ తుఁడు "శార్ఙ్గరవా! ఇఁకఁజాలును! ఈవృథావాక్యవిన్యాసము వలనఁ బ్రయోజన మేమున్నది? ఒక్కటేమాట—దానితో నంతయును వదలిపోవును." అని శకుంతలవంకఁ దిరిగి "శకుం తలా! మేము చెప్పవలసినదేమో చెప్పితిమి. మహారాజట్లు

చెప్పుచున్నాఁడు! ఇఁక నీవు చెప్పవలసినదేమైన నున్న యెడలఁ జెప్పుము! ఈపనికి నీసంగతి యెట్లు జ్ఞప్తికివచ్చునో యట్లుచే యుము!'' అనియెను. అప్పుడు శకుంతల యతిమృదులస్వరము తో ,,అంతటియనురాగమే యీవిధముగా మారిపోయినప్పుడు పూర్వవృత్తాంతముం దెలిపిమాత్ర మేమిచేయుదును?'' అని రాజువంకఁ దిరిగి ,,ఆర్యపుత్రా—" అని సంబోధించి నిలువున నిస్పృహయై ,,పెండ్లివిషయమునసే సంశయించుచున్న మిమ్ముల నార్యపుత్రయని యెట్లు సంబోధింతును? ఓపౌరవా! నేనతి సరళస్వభావురాలను! మంచిచెడ్డల నాలోచించి యెఱుంగని దా నను. నాఁడు తపోవనమున నీవు కేవలము నిష్కపటునివలె నటి యించి ధర్మమును సాక్షిగాఁజేసి ప్రతిజ్ఞం గావించి నన్నుఁ బెం డ్లియాడి యిప్పుడీవిధముగా నసత్యమార్గము ననుసరించుట నీ వంటివానికిఁ దగదు.'' అని మూదలించెను.

రాజామాట విని యించుక కోపముతో ,,ఓఋషి కుమారీ! వర్షాకాలవాహిని తీరభూరుహమును బడఁద్రోసి యా త్మప్రవాహమును గళంకితముగఁ జేసికొనునట్లు నీవునన్నుఁ బద చ్యుతునిం గావించి నీకులమునకుఁ గళంకము తెచ్చుకొనఁజూచు చున్నావు'' అని నొవ్వనాడెను. అంత శకుంతల ,,రాజా! వలం చిది. నీవు నిజముగా వివాహసందేహముచేఁ బరస్త్రీకరగ్రహణ మగునేమో యని భయపడుచుంటివేని నీకొక చిహ్నమును జూ పించి నీయనుమానమును దీర్చివైచుచున్నాను.'' అనుచుండు

రాజు ,,మునికుమారీ! అట్లయినచో నీకం నేమి! ఏది! నీయభి జ్ఞాన మేదియో చూపింపుము!'' అనియెను.

శకుంతల రాజదత్తాంగుళీయకమును చేలాంచలమున ముడిచికొని తెచ్చియుండెను. ఇప్పుడామె తొందరతో దానిని దీసి చూపవలయునని ప్రయత్నించెను. కాని యది యగపడ లేదు. అప్పు డామె విషాదమ్లానవదనయై గౌతమి మొగమువంకం జూచెను. గౌతమియును దీనవదనముతో ,, ముడి సరిగ లేక పోవుటచే స్నానముచేయునప్పు డాయుంగరము నదిలో జాఱిపడి పోయినది కాంబోలును!'' అనియెను. రాజామాట లాలకించి యించుక పరిహసించుచు ,, స్త్రీలు సమయోచితబుద్ధికలవా రనుమాట జగత్ప్రసిద్ధమేగదా! ఇదియే దాని కొకమంచియుదాహరణము!'' అనియెను.

రాజిట్లు పలుకుటచే శకుంతల నిలువునసీరై మందస్వరముతో ,, రాజా ! నేను నాదురదృష్టవశంబున నంగుళీయకము ను బోంగొట్టుకొంటిని. కాని యింకొకమాట చెప్పెదను. ఆమా టవిన్నచో మీకుం బూర్వవృత్తాంతము స్మృతికిరావచ్చును!'' అనుటయు రాజు ,, అట్లయినచో నేమాటచెప్పిన నాకు జ్ఞప్తి కలుగునో యిప్పుడే చెప్పవచ్చును'' అనియెను. అంత శకుంతల ''మహారాజా! బాగుగ మనసుంచి చూడుము! మీరును నేను నేకాంతముగ నొకనాండు నవమాలికానికుంజమునం గూర్చుండి

యుంటిమి. అప్పుడు జలసంపూర్ణమగు తామరాకుల దొన్నె మీహస్తములందున్నది—" అని చెప్పుచుండఁగా రాజు ,,మంచిది అంతయును జెప్పుము—వినుచునేయున్నాను " అనియెను. తరువాత శకుంతల ,, ఆసమయమున నేను బిడ్డవలెఁ బెంచుకొనుచున్న దీర్ఘాపాంగమను లేఁడిపిల్ల మనయొద్దకు వచ్చినది. అప్పుడు మీరు నీరు త్రాగించుటకై దాని బిలిచితిరి. మీరపరిచితు లగుటచే నది మీయొద్దకుఁ జనువుతో వచ్చినదికాదు. పిమ్మట నేను చేతితో సంజ్ఞచేసినంతమాత్రమునఁ గురంగశాబకము నాయొద్దకు వచ్చినది. అప్పుడు మీరు నన్నుఁ జూచి పరిహాసముగా ,, సజాతీయు లగువారికే గాని పరస్పరవిశ్వాస ముండుట యసంభవము! మీరిరువురు నడవిజాతివారు. కావుననే యాలేఁడిపిల్ల నీయొద్దకు వచ్చినది. " అని పలికితిరి. ఈ మాట మీకు స్మరణకు వచ్చినదా " అనియెను.)

రాజు నవ్వుచు ,, వంచనాపూర్వకంబులగు కామినీవచనుల యిట్టి తీయనిమాటలే విషయాసక్తులగు పూరుషులకు వశీకరణమంత్రములు! " అనియెను. గౌతమి యించుక కోపము ను బ్రదర్శించుచు ,, మహారాజా! ఈబాలిక పుట్టినదిమొదలు తపోవనముననే పెంపఁబడినది. మోసమనిన నేమో యీమె యెఱుఁగనే యెఱుఁగదు!" అనియెను. అంతట మహారాజు ,,అమ్మా! ప్రవంచనమనునది స్త్రీజాతికి స్వభావసిద్ధమగు విద్యయే. దానిని వారు నేర్చుకొననక్కఱలేదు. తమసంతాన మిత

రపతులచేఁ జెంపఁబడునట్లు కోకిలలు మోసముచేయుటలేదా ?"
అనియెను.

శకుంతల కోపావేశముతో "అనార్యా ! నీవు నీస్వభా
వమునుబట్టి యితరుల స్వభావమునుగూడ నిర్ణయించుచున్నా
వే ! " అనియెను. రాజు "మునితనయా ! దుష్యంతుం డెన్నఁ
డును రహస్యముగ నెట్టికార్యమును జేసియుండలేదు ! ఆతఁడు
చేసినపను లన్నియు సర్వత్ర ప్రసిద్ధములే యైయున్నవి. నేను
నీపాణిగ్రహణముం గావించిన ట్లెవ్వరైన నెఱుంగుదురేమో
చూపింపుము ! " అనియెను. శకుంతల నిర్విణ్ణయై మంద్రగద్గద
స్వరముతో "నీవు నన్నిందఱియెదుటను స్వైరిణిగాఁ జేసివై
చితివి. పురువంశజు లుదారహృదయు లను నమ్మకముతో
నేను మధుముఖపాషాణహృదయుఁడవగు నీచేతులలో నాత్మ
సమర్పణముం గావించుకొంటిని. దానికిఁ దగినశాస్తి యైనది.
ఇందు విచిత్ర మేమున్నది ? " అని యంగుళీయకమును ముడి
చిన చేలాంచలముం జూచుకొనుచు రోదనముచేయ నా
రంభించెను.

అప్పుడు శార్ఙ్గరవుఁడు "వెనుక ముందుఁ జూడక పనిచే
యువారు తుట్టతుద కీవిధముగా మనస్తాపము ననుభవింపవలసిన
వారే యైయుందురు. కావున రహస్యకార్యములం గావించు
వారు బాగుగ నాలోచించుకొనియే కార్యక్రమమునకుఁ గడం
గవలయును. పరస్పరహృదయముల నెఱుంగక మిత్రత్వమునకుఁ

దలకొనినచోఁ దుద కది శతృత్వముగఁ బరిణమింపఁగలదు !!' అని యుగ్గడించెను. రాజాతని తిరస్కారవచనముల నాలకించి ,, అయ్యా ! మీరొక యాఁడుదానిమాటలను విశ్వసించి యూరక నాయెడ నేలదోషారోపణముం గావించెదరు ? " అనియెను. శార్ఙ్గరవ్రుఁడు క్రోధావేశవివశుఁడై ,, పుట్టినదిమొద లెన్నఁడు నెట్టికాపట్యము నెఱుఁగనివారిమాట లప్రమాణములును నిరంతరమును బరప్రతారణవిద్యాశిక్షితు లగువారిమాటలు ప్రమాణములునా ? '' అని తూలనాడెను. అంతట రాజు శార్ఙ్గరవునిం జూచి ,, మహాత్మా ! మీరు సత్యవాదులే యని నేనంగీకరించితిని. ప్రతారణమే మావిద్య—మావ్యాపారము. కాని మిమ్మొక్కమాట యడుగుచున్నాను. ఈమెను మోసముచేయుటవలన నాకేమి లాభమున్నది ? " అనియెను.

ఈవివాదముం గాంచుచున్న శారద్వతుఁడు క్రోధముతో ,, శార్ఙ్గరవా ! ఈవాక్యోపవాక్యములవలన నేమిప్రయోజనము ! మనము గురువుగారి యాజ్ఞనతిఁ బరిపాలించితిమి. ఇఁక మనము వెడలిపోవచ్చును '' అని చెప్పి రాజుం గాంచి ,,మహారాజా ! ఈమె నీసహధర్మిణి ! ఇష్టమున్నచోఁ బరిగ్రహింపుము—లేకున్న చోఁ బరిత్యజింపుము ! భార్యయెడల భర్తకు సర్వాధికారములును గలవుగదా. " అని యూతఁడు గౌతమీశార్ఙ్గరవులను వెంటఁబెట్టుకొని ప్రయాణోన్ముఖుఁ డయ్యెను.

అందఱును బోవుచుండుటం గాంచి శకుంతల యశ్రు

పూరితనయనయై దుఃఖగద్గదస్వరంబున "ఈరాజు నన్నిట్లు నిందించినాఁడు; మీరుకూడ నన్ను విడిచిపోయినచో నాకిఁక గతి యేమున్నది ?" అని వారి వెనుకనే నడచుట కుపక్రమించెను. అంత గౌతమి యించుక యాఁగి "వత్సా ! శార్ఙ్గరవా ! శకుంతల యేడ్చుచు నన్ననుసరించి వచ్చుచున్నది. రాజు పరిత్యజించిన పుడీమె యిచ్చోట నెట్లుండునో చెప్పుము ! నామాట వినియీమెను నావెంట రానిమ్ము !" అనియెను. ఆమాట విన్నతోడనే శార్ఙ్గరవుఁడు సరోషనయనుఁడై మొగముద్రిప్పి శకుంతలం గాంచి "ఓపాపాత్మురాలా ! స్వతంత్రురాలవై నందుకుఁ దగినశాస్తి యైనదా ? అని గద్దించెను.

శకుంతల సర్వాంగకములును భయదుఃఖావేశముచేఁ గంపించిపోవుచుండెను. అప్పుడు శార్ఙ్గరవుఁడు మరల "శకుంతలా ! రాజెట్లు చెప్పుచున్నాఁడో వింటివిగదా ! ఆతనిమాట నిజమే యైనయెడల నిశ్చయముగా నీవు స్వైరిణి వైతివి. అట్టిచో మహాత్ముఁ డగు కణ్వుఁడుమాత్రము నీమొగ మెట్లుచూడఁగలఁడు ? "నేను పతివ్రతనే" యని నీకు ధైర్యమున్నయెడల నీవు నిజముగా నీభర్తృగేహమున దాస్యవృత్తినైన నవలంబించి యుండుట యుత్తమధర్మము ! కావున నీవిచ్చటనె యుండుము. మేమిఁకఁ బోయెదము." అనిచెప్పి యాతఁడు పయనమును సాగించెను.

వారు పోవుచుండుటం గాంచి రాజు శార్ఙ్గరవునిం బిలిచి

,, మహాత్మా ! మీరీమె నూరక మోసగించి పోయెదరేల ? పురువంశీయులు ప్రాణాంతసమయమునందైనను బరవనితా పరిగ్రహణముం గావింపఁజాలరు. చంద్రుఁడు కుముదినినే వికసిల్లఁ జేయును; సూర్యుఁడు కమలినినే యుల్లసిల్లఁ జేయును ! ” అనియెను.

శా—మహారాజా ! నీవు పరకాంతయేమో యను భయముచే శకుంతలను బరిగ్రహింపఁజాలకున్నావు. ఇదియును న్యాయమే. పాపము నీవు మఱచిపోయి యుందువు.

రాజు సమీపమునందున్న పురోహితునిం జూచి ,,మహాత్మా ! మీరు పాపమునకుఁ గొలఁదిగొప్పల నాలోచించి యీ సందిగ్ధవిషయమునఁ గర్తవ్యమును నిర్ణయింపవలయు. పూర్వవృత్తాంతమును నేనే మఱచిపోయితినో కాక యీ కామినియే యసత్యము లాడుచుండెనో తెలియఁబడని యిప్పట్టున నేమిచేసినను, దారత్యాగపాతకమో, పరస్త్రీ పరిగ్రహణపాతకమో నే ననుభవింపవలసివచ్చునని భయపడుచున్నాను ” అనియెను.

పురోహితుఁడించుకసే పాలోచించి ,, మహారాజా ! నాకొక్కటి ధర్మముగాఁ దోఁచుచున్నది. ఈమునితనయ ప్రసవించువఱకు నిచ్చటనే యుండుఁగాక ! నేనిట్లేల చెప్పుచున్నానో తెలిసినదా ? నీప్రథమసంతానము చక్రవర్తి లక్షణములు కలిగియుండు నని సిద్ధపురుషులు చెప్పియున్నారు. మునిదౌహిత్రుఁ డట్టిలక్షణములు కలవాఁడైనచో నీమెను బరిగ్రహింప

వచ్చును. లేకున్నచో నీమెను మరలఁ బుట్టినింటికిఁ బంపివేయ వచ్చును.” అనియెను.

రాజు——మీచిత్తము ! అట్లయినచో నీమెను బ్రసవించు నంతవఱకును నాయింటియందే యుంచెదను.

అని రాజు శకుంతలం గాంచి ,, వత్సా ! నీవు రాజాంతః పురమునం దుండవచ్చును ” అనియెను. శకుంతల యవమాన దుఃఖగద్గదస్వరముతో ,, తల్లీ ! భూదేవీ ! నీవించుక పగిలి పాయ యిచ్చినచో నేను నీగర్భమునఁ బ్రవేశించెదను ! ఈ యవమా నమును భరించుచు నేనికఁ బ్రాణములతో నుండఁజాలను ” అని వెక్కి వెక్కి యేడ్చుచుఁ బురోహితు ననుసరించి పోవు చుండెను.

అందఱును లేచిరి. రాజు కేవల ముద్విగ్నహృదయుఁడై శకుంతలం గూర్చియే యనన్యచిత్తుఁడై యాలోచించుకొనుచుం డెను. ఆసమయమున ,, ఎంతయాశ్చర్యము ! ఎంతయాశ్చ ర్యము. ” అను మాటలు మహారాజు కర్ణకుహరములఁ బ్రతిధ్వ నింప నారంభించెను. అప్పు డాతఁడు ,, ఏమిది ? ఏమిజరిగినది?” అని పార్శ్వమునందున్న ప్రతీహారి నడిగెను. అంతలో నాకస్మిక ముగఁ బురోహితుఁ డచ్చోటికి వచ్చి తత్తరముతో ,, మహా ప్రభూ ! ఇప్పుడొక యద్భుతకృత్యము జరిగిపోయినది ! ఆసతీ మణి నావెంట వచ్చుచు వచ్చుచు నప్సరస్తీర్థమునొద్ద సంఘటిల్లి న తనదురదృష్టమును నిందించుకొనుచుఁ బెద్దపెట్టున రోదనము

చేయనారంభించినది. అప్పు డొక జ్యోతిర్మూర్తి—స్త్రీమూర్తి యాకస్మికముగ సాక్షాత్కరించి యామె నువ్వెత్తుగ నెత్తుకొని నిమిషములో నంతర్హితమై పోయినది!" అని చెప్పెను.

రాజు—మహాత్మా! మనమే పరిత్యజింపఁదలఁచియున్న యామెవిషయమై యింకను నంతగా నాలోచన మేల? మీరు గృహంబునకు దయచేయుఁడు!

పురో—మహారాజునకు జయమగుఁగాక!

అని యాశీర్వదించి యాతఁడు వెడలిపోయెను. రాజు శకుంతలావృత్తాంతముం గూర్చి యత్యాకులహృదయుఁడై శయనాగారమునకు వెడలిపోయెను.

---

## షష్ఠాంకము

### ప్రథమదృశ్యము—చౌర్యోద్ఘాటనము.

శకుంతల నదిలో స్నానము చేయుచుండఁగా రాజదత్తాంగుళీయక మామె చేలాంచలమునుండి జాఱి పడిపోయినది. తోడనే యాయుంగరము నొక చేఁప మ్రింగెను. కొన్నాళ్ళకుఁ దరువాత నామత్స్య మొక పల్లెవానివలలోఁ బడెను. ఆపెద్ద చేఁపం జూచి పల్లెవాఁడు పరమానందముతో విక్రయించుటకై దానిని ఖండఖండములుగాఁ గోసెను. ఆసమయమున దానియుదర

మధ్యమునం దాయుంగర మాతని కగపడియెను. అందుచే నాతఁడు మిక్కిలియును సంతోషించి యాయుంగరమును విక్రయించుటకై రత్నవర్తకుని యొద్దకుఁ బోయెను. రాజనామాంకితమగు నామణిమయాంగుళీయకముం గాంచి వర్తకుఁ డాపల్లెవానినిఁ జోరునిగా భావించి యాసంగతి నగరపాలకునకుఁ దెలియఁజేసెను. తోడనే పురపాలకుఁడు వచ్చి యాధీవరుని బంధించి ,, ఓరి దొంగా ! నీకీయుంగర మెక్కడ దొరకినదో చెప్పుము ! '' అని నిర్బంధించెను.

పల్లె—మహాప్రభూ ! నేను దొంగనుగాను.

పుర—ఔను. నీవు దొంగవే కాకయున్నచోఁ గూలి వానికి నీకీరత్నాంగుళీయక మెట్లు లభించినది ? నీవు దొంగిలింప కపోయినచో రాజుగారు దీనిని నీకు బహుమానముగా నిచ్చి యుండిరా యేమి ?

అని పురపాలకుఁడు చౌకిదారునింబిలిచి ,,ఈతనిం బ్రహారింపుము! నిజము చెప్పకున్నాఁడు!” అనియెను. చౌకిదారుఁ డాతని గొట్ట నారంభించెను. పల్లెవాఁడు భయప్రకంపితుఁడై ,, అయ్యా ! నేను దొంగనుగాను. నన్నేల కొట్టెదరు? నాకీయుంగర మెట్లుదొరకినదో చెప్పుచున్నాను వినుఁడు! అయ్యా! నేను పల్లెవాఁడను. చేఁపల నమ్ముకొని జీవించుచుందును—” అగ్ధోకియుండే పురపాలకుఁడు కోపావిష్టుఁడై ,,తన్నుఁడు! కొట్టుఁడు! కారాగృహమున కీడ్చుకొని పొండు!—ఓరిగాడిదా! నేను

నీకులగోత్రము లడిగితినా? ఈయుంగరము నీయొద్దకెట్లు వచ్చి నది? చెప్పుము!" అని గద్దించెను.

పల్లె—బాబూ! వినుఁడు! నేఁటియుదయమున నేను శచీతీర్థమున వలవైచితిని. అందొక పెద్దచేఁప పడినది. దానిని గోయుచుండఁగా దానిగర్భమునం దీయుంగరము కానఁబడినది. పిమ్మట నేనీయంగడికిఁ దెచ్చి దానిని విక్రయింపఁదలఁచి వచ్చితిని. ఇంతలో మీరువచ్చి నన్నుఁ బట్టుకొంటిరి. బాబూ! ఇంతకంటె నేనేమియు నెఱుఁగను. కొట్టవలసినచోఁ గొట్టుఁడు! చంపవలసినచోఁ జంపుఁడు—నేనుమాత్రము దొంగతనముచేయలేదు.

పురపాలకుఁ డాయుంగరము నాఘ్రాణించి చూచెను. దానియందు మత్స్యగంధము కానఁబడుచుండెను. అందుచే నాతఁడించుక సంశయించి చౌకిదారునిం జూచి "నీవిద్యోడనే యీతఁడెచ్చోటికిని బాఱిపోకుండఁ గాచికొని యుండుము! నేను రాజసభకుఁ బోయి సకలవృత్తాంతమును మనవిచేసివచ్చెదను. దీనికి రాజుగారేమని యాజ్ఞాపింతురో యట్లు చేయవచ్చును." అని యాతఁడాయుంగరముం దీసికొని రాజమందిరాభిముఖుఁడై పోయి కొలఁదిసేపటిలోనే తిరిగివచ్చి "ఓయీ! శీఘ్రముగా నీపల్లెవానిబంధనముల వదలింపుము! వీఁడు చోరుఁడు కాఁడు! ఈయుంగరమును గుఱించి యితఁడు చెప్పినమాటల యం దెంతమాత్రము నసత్యము లేదు. ఆయుంగరముదొరకు మూల్యముగా రాజుగారీతనికి లక్షవరాలు బహుమానముగూడ

నిచ్చియున్నారు!" అని చెప్పుచు బహుమానద్రవ్యమును బల్లె వానికిచ్చి పంపివైచి చౌకీదారుని వెంటఁబెట్టుకొని యాతఁడట నుండి వెడలిపోయెను.

---

ద్వితీయదృశ్యము—విరహము.

ఉంగరము చేతికి దొరకినంతమాత్రమున రాజునకు శకుంతలావృత్తాంత మంతయు నాద్యోపాంతముగా జ్ఞప్తికివచ్చెను. అప్పుడాతఁ డతివిహ్వలహృదయుఁడై తల్లడిల్లిపోవుచుండెను. ఇఁక నాతనికి శకుంతలపునర్దర్శనవిషయమున నాశలేదు. అందు చేత నాతనికి సర్వవిషయములందును నిరుత్సాహమే కలుగుచుండెను. ఆహారము, విహారము, రాజకార్యపర్యాలోచనము నొక్కసారిగాఁ బరిత్యక్తము లైపోయెను. కేవలము శకుంతలాధ్యానమునందే నిమగ్నుఁడై సర్వదా మ్లానవదనముతో నతికష్టమున గాలయాపనముం గావించుచుండెను. ఎవ్వరికినిగూడ దర్శన మిచ్చుటలేదు. కేవలము ప్రియవయస్యుఁడగు మాధవ్యునితో డనేకలసి కాలము గడపుకొనుచుండెను. మాధవ్యుఁడు సాంత్వనవచనములతో నాతనిఁ బ్రబోధించుచుండెను. అతని శోకసాగరము పొంగిపొరలుచుండుటచే నయనయుగళమునుండి యవిరళాశ్రుధారలు ప్రవహించుచుండెను. ఉబుసుపోకకు రాజొకనాఁడు మాధవుని ప్రమోదవనమునకు వెంటఁబెట్టుకొని పో

యెను. ఉందిరువురును శీతలశిలాతలంబున నుపవసించియున్న ప్పుడు మాధవ్యుఁడు ,,వయస్యా! నీవు తపోవనమున శకుంత లను బాణిగ్రహణము చేసికొన్నమాట నిజమేయైనయెడల నా మెవచ్చినప్పుడు తిరస్కరించితివేమి?'' అని యడిగెను. రాజు నిట్టూర్పువిడిచి ,, మిత్రమా! మరల నాకాసంగతి నేల జ్ఞప్తి కిఁ దెచ్చెదవు? నేను రాజధానికి వచ్చినతోడనే శకుంతలావృ త్తాంత మొక్కసారిగా మఱచిపోయితిని. అట్లేల మఱచిపోయి తినో యించుకంతయును బోధపడుటలేదు. నాప్రాణేశ్వరియగు శకుంతల యాదినమునం దెన్నియోవిధముల నాకు జ్ఞప్తి కలి గించుటకుఁ బ్రయత్నించినది. కాని, నాకు మతి చెదరిపోయి నది. ఇంచుకంతయును స్మృతి కలిగినది కాదు. నేనామెను వైరిణిగా భావించి నోటికిరాని దుర్భాషలాడితిని. సాధ్వీమణి నెంతగా నవమానించితిని!'' అనుచుండఁగా రాజుకన్నుల నీరు నిండిపోయెను. మాటాడుటకు శక్తిలేనివానివలె నాతఁడు కొం టొకసేపు జడప్రాయుఁడై యుండి పిమ్మట మరల ,,చెలికాఁడా! ఏకారణమునవో నేను మఱచిపోయితిననుకొనుము. ఈసంగతి యంతయు నీకప్పుడు చెప్పియుంటినిగదా! నీవైన నొకప్పుడైన నాకు జ్ఞప్తికిఁ దేలేదు! నీవుకూడ నావలెనే మఱచిపోయితివా యేమి ?'' అనియెను.

మాధ—మిత్రమా! ఇందు నాదోషమేమియును లేదు. నీవప్పుడు నాకంతయును జెప్పి తుట్టతుదకు ,,శకుంతలనుగూర్చి

నేఁజెప్పినదంతయుఁ గేవలము పరిహాసమునుమా!" అనిచెప్పి తివి. తెలివితక్కువవాఁడను నేను నీవుచెప్పిన తుదిమాటయే సత్యమని నమ్మకొనియుంటిని. అందుచేతనే నేనెన్నఁడును నీ యొద్ద శకుంతలనుగూర్చి ప్రశంసింపలేదు. ఇంతేకాక నీవా మెను బరిత్యజించినదినమున నేను నీయొద్ద లేను. ఉన్నచో. నిది వఱకు నాకుఁ దెలిసినంతవఱకు నీకు జ్ఞప్తికిఁ దెచ్చియే యుందును.

రాజు దీర్ఘనిశ్శ్వాసమును విడిచి బాష్పాకులలోచనుఁడై గద్గదస్వరముతో "మాధవ్యా! నేనెవ్వరిపై దోషారోపణము చేయుదును! కేవలము నిది నాయదృష్టదోషము!" అని మిగుల శోకాకులహృదయుఁడై పోయెను. అప్పుడు మాధవ్యుఁడు "మహారాజా! ఈవిధముగ దుఃఖాకులుఁడవై యుండుట నీకు విహితముకాదు. చూడుము! సత్పురుషులు శోకమోహములకు వశులుగారు. సామాన్యులుమాత్రమే శోకమోహములకు లోఁబడుదురు. రెండునుగూడ వాయువేగమునకుఁ బ్రచలితములై పోయినయెడల నిఁక వృక్షమునకును బర్వతమునకును భేద మేమియుండును? నీవు గంభీరస్వభావుఁడవు. ధైర్యము వహించి శోకము నుజ్జగింపుము!" అనియెను.

మాధవ్యుని యుపదేశము నాలకించి మహారాజు "వయస్యా! నేను కేవలమును దెలివిలేని వాఁడనుగాను. కాని, నా హృదయ మిప్పు డెట్టిప్రబోధమును మన్నించుట లేదు. దాని

నెట్లు ప్రిబోధింతును? నేనప్పుడు సభలోఁ దిరస్కరించినతరువాతఁ బ్రియురాలు వెడలిపోవుచుఁ దనహృదయసంతాపమును బ్రదర్శించు బాష్పపూరితదృష్టులను మాటిమాటికి నాపైఁ బఱగించినది. ఆదృష్టిపాతమే నాహృదయమునందు విషశరాఘాతమువలె వేధించుచున్నది. నేనప్పుడామెయెడల నెంతకూరిరముగఁ బ్రవర్తించితినో తలఁచుకొన్నచో నాగుండె పగిలిపోవుచున్నది. మరణించినను నాకీదుఃఖము వదలునట్లు తోఁచుట లేదు" అనియెను.

రాజిట్లు తల్లడపడి పోవుచుండుటం గాంచి మాధవ్యుఁడు "మిత్రమా! ఏల యిట్లు వ్యాకులపడియెదవు? కొలఁది కాలములోనే నీకు మరల శకుంతలాసమాగమము కాఁగలదు" అనియెను. రాజు "మిత్రమా! నాకాయాశ యెంతమాత్రమును లేదు. ఇఁక నాకు నాప్రియురాలిదర్శనము లభియింపదు. ఈ జన్మమునం దిఁక నాసర్వసుఖములును దొలఁగిపోయినవి. కాకున్నచో నాకప్పుడంతటిదుర్బుద్ధి యేల పుట్టును?" అనియెను. మాధవ్యుఁడు "వయస్యా! ఏవిషయమునందును నింతటి నిరాశపడుట యుచితముకాదు. ముందేమి జరుగునో యెవ్వరెఱుంగుదురు? చూడుము! ఈయుంగరము మరల నీచేతి కెన్నఁడైన వచ్చునని నీవెప్పుడైనఁ దలంచితివా?" అనియెను.

ఆమాట విన్నతోడనే రాజు తనయుంగరముపైఁ జూపులు పఱపించి "ఓయంగుళీయకమా! నీవును నావలెనే హతభా

గ్యురాలవై తివి. కాకున్నచో నాప్రియురాలి కోమలకరాంగుళీ నాశ్రయించియు నంతటిదుర్లభస్థానమునుండి యేలభ్రష్టురాల వగుదువు?" అనియెను. అప్పుడు మాధవ్యుఁడు "మిత్రమా! నీవేయుద్దేశముతో నీయుంగరము నామెవ్రేలి నలంకరించితివి?" అని ప్రశ్నించెను. రాజు "మిత్రమా! నేను రాజధానికిఁ దిరిగి వచ్చునప్పుడు నాప్రాణేశ్వరి బాష్పపూరితనయనములతో నా చేయి పట్టుకొని "ఆర్యపుత్రా! ఎన్నాళ్ళలో నన్ను మీయొద్ద కుఁ జేర్చుకొందురు?" అని ప్రార్థించుటచే నేనీయుంగరము నా మెవ్రేలికిఁ దొడిగి "ప్రియురాలా! ఈయుంగరమునం దెన్ని యక్షరములు ముద్రింపఁబడియున్నవో యన్నిదినములలో నా పరివారమువచ్చి నిన్ను రాజధానికి వెంటఁబెట్టుకొని వచ్చును" అని నేనీవిధముగాఁ బ్రాణేశ్వరియొద్ద నిష్కపటముగాఁ బ్రతిజ్ఞ చేసియు బుద్ధిహీనుఁడనై యొక్కసారిగా మఱచిపోయితిని" అనియెను.

మాధ—ఈయుంగరము చేఁపగర్భమునం దెట్లు చేరినది?

రాజు—శచీతీర్థమున స్నానము చేయుచుండఁగాఁ జెఱఁగుముడినుండి జాఱి నీళ్ళలోఁ బడిపోయిన దని ప్రాణేశ్వరిమూలమునసే వినియుంటిని.

మాధ—సరే. అట్లయినచోఁ జేఁపమ్రింగుట కవకాశ మున్నది!

రాజాయంగుళీయకము గాంచుచు "నేనీయుంగరమును

దగురీతి నిందించెదను." అనుచు "ఓయంగుళీయకమా! ప్రాణేశ్వరికోమలకరపల్లవమును బరిత్యజించి ప్రవాహజలనిమగ్నమై నీవేమిలాభ మనుభవించితివి?—నిన్ననుట యేల? అచేతనవ్యక్తికి గుణగ్రహణశక్తి యెట్లుండును? సచేతనుఁడ నగు నేనే చేతులారఁ బ్రియురాలిని బరిత్యజించితినిగాదా?" అని నిందించుకొనుచుఁ గన్నీటితో శకుంతల నుద్దేశించి "ఆత్మేశ్వరీ! నేను నిన్నకారణముగఁ బరిత్యజించితిని. ఆఘనతాపానలముచే నాహృదయము దహించుకొనిపోవుచున్నది. ఒకసారి సాక్షాత్కరించి ప్రాణరక్షణముం గావింపుము!" అని పలవింపఁ దొడంగెను.

రాజిట్లు వ్యాకులపడుచుండఁగాఁ జతురిక యనుపరిచారిక యచ్చోటికి వచ్చి యొకచిత్రఫలకము నాతనిచేతికిచ్చెను. రాజువినోదముకొఱకు హృదయశాంతికొఱకుఁ జిత్రఫలకముపై స్వయముగా శకుంతలప్రతిమూర్తిని లిఖయింప నారంభించెను. మాధవ్యుఁ డామూర్తింజూచి విస్మయోత్ఫుల్లనయనములతో "వయస్యా! నీవెంతటియసాధారణమై పుణ్యమును జూపితివి! ఇది చిత్రరూపమువలె లేదు. నిజముగా స్త్రీమూర్తియే. ఆహా! ఏమి యీరూపలావణ్యమాధురీవిలాసము! ఏమి యీయవయవసౌందర్యము! ఏమియీకుమారయుక స్వభావము! ఉచితలజ్జాభావవిలసితంబగు నీవదనారవింద మెంతయందముగా నున్నది?" అనియెను.

రాజు మాధవ్యునిం గాంచి "చెలికాఁడా! నిజమే నిజ

ముగా శకుంతలను దర్శింపలేదు. అందుచేతనే యిప్పుడు నా చిత్రలేఖనమైన పుణ్యమును బ్రశంసించుచున్నావు. ఆమెనే నీవు చూచియున్నచో నీచిత్రము నంతగాఁ బ్రశంసింపవు. అతిలోకసామాన్యంబులగు నామె రూపలావణ్యములలో నొక్కలీల మాత్రమే యీచిత్రఫలకమున లిఖింపఁబడియుండెను—చతురికా ! తూలికయు, వర్ణపాత్రమును దీసికొనిరమ్ము ! ఇంకను జిత్రింపవలసినపని చాలఁగ నున్నది. మిగిలినదానిని బూర్తిచేసెదను." అనియెను.

ఇట్లు చతురికకాజ్ఞాపించి రాజు మాధవ్యునిఁ జూచి "మిత్రమా ! నేను స్వాదుశీతలనిర్మలజలపరిపూర్ణంబగు నదిని బరిత్యజించి యిప్పుడు శుష్కమృగతృష్ణామూలమున దాహశాంతి గావించుకొనుటకుఁ బ్రయత్నించుచున్నాను. ప్రాణేశ్వరిం స్వయముగా లభించినప్పుడామెను బరిత్యజించి యిప్పుడామె ప్రతిమూర్తిని లిఖించుకొని యామూలమునఁ జిత్తమును శాంతింపఁజేసికొనఁ దలఁచుచున్నాను" అనియెను.

మాధ—మిత్రమా ! ఈచిత్రపటమునం దింకను నేమి లిఖియించెదవు ?

రాజు—తపోవనమును, మాలినీనదియును, లిఖియింపవలయును. మఱియుఁ దపోవనమున స్వచ్ఛందముగ విహరించుచున్న హరిణగణమును జూచినవానిని జూచినట్లుగాఁ జిత్రింపవలయును. మఱచిపోయితిని. ప్రథమదర్శనసమయమునఁ బ్రా

శ్వేశ్వరి కర్ణాలంకారముగా శిరీషకుసుమమును దాల్చినది. దానిని, గూడ యథారూపముగఁ జిత్రింపవలయును.

ఇంతలో నొక ప్రతీహారి వచ్చి రాజహస్తమునం దొక లేఖను సమర్పించి వెడలిపోయెను. రాజా లేఖను జదివి యత్యంతదుఃఖితుఁడై పోయెను. అప్పుడు మాధవ్యుఁడు "వయస్యా! అదియేమిలేఖ? దానిని జదివి యింత వ్యాకులపడుటకుఁ గారణమేమి?" అని ప్రశ్నించెను. అందుపై రాజు "మాధవ్యా! ధనమిత్రుఁడను నొకవర్తకుఁడు సముద్రయాత్ర చేయుచు నోడ మునుఁగుటచే సాగరమధ్యమున మునిఁగి మరణించెనఁట! ఆతనికి సంతతి లేకపోవుటచే నాతని ద్రవ్యమంతయును రాజకోశమునకుఁ జేరవలసియున్నదనియు, నట్లు చేయుటకు సెలవీయవలయుననియు మంత్రి వ్రాసినాఁడు! మిత్రమా! చూడుము! సంతానము లేకపోవుట యెంతటి దుఃఖకరమగు విషయము! పేరు మాసిపోవును—వంశము లేకుండఁబోవును—అతికష్టముచే సంపాదించుకొన్న ద్రవ్యమంతయు నన్యులపాలై పోవును. ఇంతకంటెను గష్టవిషయ మేమున్నది?" అని యొక్కనిట్టూర్పు విడిచి నాయనంతరమున నాపేరును నావంశమును, నారాజ్యమును గూడ నిట్లు కావలసినదేగదా!" అనియె.

మాధ—మహారాజా! అకారణముగ నిట్లు పరితాపపడియెదరేల? నీకింకను సంతానపయస్సు మీఁటిపోలేదు. కొన్ని

దినములలోనే నీవపత్యముగఁ బుత్రిముఖవీక్షణలాభము బడ యఁగలవు

రాజు——మిత్రిమా! వట్టిమాటలతో నన్నేల సంతోష పెట్టెదవు? మూఢులు లభించినదానిని బరిత్యజించి యలభ్య పదార్థము నాసించుచుందురు. నేను బుద్ధిహీనుఁడనై యెప్పుడు పిృియురాలిని బరిత్యజించితినో యప్పుడే నాకుఁ బుత్రిముఖసం దర్శన భాగ్యము వదలిపోయినది.

ఇట్లు చెప్పుచు రాజు తనయనపత్యతాదుఃఖము నుపశ మింపఁజేసికొని ప్రితీహారిం జూచి „ నీవు పోయి యాధనమిత్రుని భార్యలలో నెవ్వరైన గర్భవతియై యున్నదేమో కనుఁగొను మని మంత్రికి మాయాజ్ఞగాఁ దెలుపుము! ” అనియెను.

ప్రితీ——మహారాజా! అయోధ్యానివాసి యగు నొక వర్తకునితనయ ధనమిత్రునకు భార్యయైయున్నది. ఆమె యిప్పు డంతస్సత్వయై యున్నదఁట!

రాజు——అట్లయినచో నామె గర్భమునఁ బ్రిసవించిన శిశువున కాధనమిత్రుని సర్వస్వమునుఁ జెందవలసియుండు నని మాయానతిగా మంత్రితోఁ జెప్పుము.

రాజిట్లు శాసించి ప్రితీహారిని బంపివైచి మాధవ్యునితో మరల శకుంతలం గూర్చి మాటలాడుచుండెను. ఇంతలో నింద్ర సారథి యగు మాతలి దేవరథసహితముగా నయ్యెడఁ బ్రవేశిం చెను. రాజు పరమానందముతో మాతలిని గుశల మడిగి కీత

మునఁ గూర్చుండఁ జేసెను. అప్పుడు మాతలి ,, మహారాజా! దేవేంద్రుఁడు నన్ను మీదర్శనమునకుఁ బంపించినాఁడు. కాలనేమి సంతతులగు దుర్జయాదిరాక్షసులు కొందఱు కొన్నాళ్ళనుండి ద్వేషముతో దేవతలను బాధించుచున్నారు. నీవు నాకమునకు వచ్చి యాదుష్టరాక్షసులను నిర్జించి దేవహితముం గావింపవలయును. ఇది దేవేంద్రుని ప్రార్థనము!'' అని మనవిచేసెను.

రాజు—దేవేంద్రుఁడు నాకిట్లాజ్ఞాపించుటచే నేననుగ్రహింపఁబడితిని—మాధవ్యా నేను కొన్నిదినములవఱకు దేవకార్యమునం దుండవలసియున్నదని యమాత్యునకుం దెలుపుము! నేను మరలివచ్చువఱకును మంత్రియే సర్వరాజకార్యములను నెఱవేర్చుచుండుఁగాక!

అని చెప్పి రాజు సర్వసన్నద్ధుఁడై యింద్రస్యందనము నధిరోహించి దేవలోకమునకు వెడలిపోయెను.

---

## సప్తమాంకము.

### ప్రథమదృశ్యము—గగనమార్గము.

రాజు—రాక్షసులను బాఱఁదోలుటకై కొన్నిదినములు దేవలోకమునందుండి యాకార్యమును నిర్వర్తించిన వెంటనే మరల మర్త్యలోకమునకు వచ్చుచు మార్గమధ్యమున మాతలిం

జూచి " ఆర్యా ! పూజ్యుఁడగు దేవేంద్రుఁడు నాకుఁ గావిం చిన సత్కారములకు నేనెంతమాత్రము నర్హుఁడను గానని తలం చుకొని మనసులోఁ జాల సిగ్గుపడుచున్నాను. " అనియెను.

మాత.—మహారాజా! ఈసంకోచ ముభయపక్షములను సమానముగనే యున్నది. నీవు చేసిన ఘనకార్యము దేవతలకుఁ గూడ నశక్యమైనది. అట్టి మహాకార్యమును సాధించి దేవత లకు మహోపకారముం గావించినమీకుఁ దగినసత్కార ముం గావింపఁజాలకపోయితినని దేవేంద్రుఁడును లజ్జితుఁ డగుం చున్నాఁడు!

రాజు.—మాతలీ! ఇట్లనియెదవేల? ఆమహేంద్రుఁడు సెలవిచ్చి నన్నుఁ బంపునప్పుడు నాకుఁ జేసినగౌరవములు కోరి కలకుఁగూడ నగోచరములైనవి. అందఱుదేవతలు కొలువైయు న్నసభలో నన్నర్ధాసనమునఁ గూర్చుండఁజేసికొని స్వహస్తము లతో నాస్వర్గేశ్వరుఁడు పారిజాతకుసుమమాలికను నాకంఠసీమ నలంకరించినాఁడు! ఇంతకన్నఁ గోరఁదగినగౌరవ మేమున్నది?

మాత.—మహారాజా! మీరుచేసిన ఘనకార్యమున కా గౌరవ మెంతపాటిది? బాగుగ నాలోచింపఁగా నిప్పుడు మీ భుజబలముచేతనే దేవలోకము నిరుపద్రవముగాఁ జేయఁబడి యున్నది.

రాజు.—నేనంతటి ఘనకార్యము ననాయాసముగఁ దీ ర్చుటకు సంకల్పసిద్ధుఁడగు దేవేంద్రుని యాజ్ఞాబలమేగదా

కారణము? సమర్థుఁడగు ప్రభునియాజ్ఞవలననే సర్వకార్యములును సిద్ధించుచుండును. అరుణమూర్తి రథారూఢుఁడు కాకయున్నచోఁ గేవలమనూరుఁడంధకారమును దూలింపఁగలుగునా?

మాతలి పరమసంతుష్టహృదయుఁడై ,, మహారాజా! వినయమే సద్గుణములకు శోభం గూర్చుచుండును. ఈసంగతి యిప్పటి నీనడవడివలననే సత్యమగుచున్నది " అనియెను. ఈవిధముగ సంభాషించుకొనుచు నాకాశమార్గమున వారు ప్రయాణము చేయుచుండిరి. అట్లు కొంతదూరం మరిగినతరువాత రాజు మాతలి నుద్దేశించి ,, అయ్యా! అదిగో! పూర్వపశ్చిమమున స్వర్ణనిర్మితమో యనునట్లొక విశాలపర్వత మగుపడుచున్నది. దాని పేరేమి? " అని ప్రశ్నించెను.

మాత—సార్వభౌమా! అది హేమకూటపర్వతము. అప్సరలకును గిన్నరులకు నది నివాసభూమి. తపస్వుల తపస్సిద్ధికది సర్వప్రధానస్థానము. భగవానుఁడగు కశ్యపుఁ డీశైలమునందే తపము చేయుచున్నాఁడు.

రాజు—అట్లయినచో నేనా మహాత్మునకుఁ బ్రదక్షిణ నమస్కారము లాచరించి పోవలయును. అంతటి మునిశేఖరుని నామమును వినియును నట్టి తపోనిధికి వందనము చేయకుండఁ బోవుట కేవల మవిధేయత యగును. కావున నీవిచ్చట రథము నాఁపుము! నేనిచ్చట దిగియెదను.

మాతలి రథము నాఁపెను. రాజు దిగి ,, మాతలి!

ఆమహాత్ముని యాశ్రమ మీపర్వతమునం దేవైపున నున్నది ? ”

మాత—మహారాజా ! ఎంతయో దూరమున లేదు. నేనుఁగూడ మీతో వచ్చెదను.

ఇరువురు నట్లు పోవుచుండఁగా నొక ఋషికుమారుఁ డగపడియెను. మాతలి యాతనిం జూచి ,, మహాత్మా, డగు కశ్యపమునీంద్రుఁ డిప్పు డేమిచేయుచున్నాఁడు!” అని యడిగెను.

ఋషి—అయ్యా ! ఆతఁ డిప్పు డాత్మపత్నియగు నదితి కిని దక్కిన మునిపత్నులకును బతివ్రతాధర్మముల నుపదేశించు చున్నాఁడు.

రాజు—అట్లనయినచో నిప్పుడు మనమొక యంతరా యముగా నామహాత్మునొద్దకుఁ బోఁగూడదు.

మాత—రాజా ! మీరీయశోకవృక్షమూలమున నిలిచి యుండుఁడు ! నేనామహర్షికి మీరాక నెఱింగించి వచ్చెదను.

అని మాతలి వెడలిపోయెను. అప్పుడు మహారాజునకు దక్షిణబాహుస్పందన మయ్యెను. అంత రాజు తనబాహువు నుద్దేశించి ,, ఓహస్తమా ! నేను బుద్ధిహీనుఁడనై యెప్పుడు నాప్రియురాలినిఁ బరిత్యజించితినో యప్పుడే నాయాశలన్నియును వదలిపోయినవి. నీవదరుచు మరల నిరర్థకముగ నాశను గల్పిం చుచున్నావేమి ?” అని యనుకొనుచుండఁగా ,, వత్సా ! యింత యల్లరిపిల్లవాఁడవై పోయితివేల ? ” అను పలుకు రాజు కర్ణకు హరమునఁ బ్రవేశించెను. రాజాలకించి ,, ఇది యవిధేయునకు

స్థానముకాదు. ఇచ్చోటి జంతువులుకూడ హింసాద్వేష మదమాత్సర్యాదులను విడిచి పరస్పరమైత్రితోడనే కాలయాపనము చేయుచుండును. అనుచితవ్యాపారములు గాని యత్యాచారములు గాని యియ్యెడ నుండుట కవకాశము లేదు. అట్టి యీతపోవనమున నిట్టి దుండగముం గావించువా రెవ్వరై యుందురు ? ఎట్లయిన నీసంగతి తెలిసికొనవలయును" అని వితర్కించుకొనియెను.

---

### ద్వితీయదృశ్యము—సందర్శనము.

రాజు వేడుకతో నామాటలు వినవచ్చినవైపున కించుక దూరము నడచి చూచెను. అక్కడ నొకచిన్నిబాలకుఁడు సింగపుఁబిల్లను బట్టుకొని యనేకవిధములఁ బీడించుచుండెను. ఆతని వెనుక నిరువురు తాపసకన్యకలు నిలిచి చూచుచుండిరి. రాజాశ్చర్యముతో ,, ఆహా ! ఈతపోవనమాహాత్మ్య మనిర్వచనీయమై యున్నదే ! మానవబాలకుఁడు సింహశాబకమును బట్టి పీడించుటయును, సింహశిశు వాకృత్యములకు సహించుటయునా ? ''
అని యించుక ముందఱికేఁ బోయి స్నేహరసపరిపూర్ణహృదయముతో ,, ఈబాలకునిం జూచినతోడనే కన్నకుమారునిం గాంచినట్లు నాహృదయము ప్రేమరసముచే నుప్పొంగిపోవుచున్నదేమి ? నేను సంతానవిహీనుఁడ నగుటచే నిట్టి ప్రగాఢప్రేమభావోదయ మగుచున్నదా ? '' అని యూహించుకొనియెను.

ఆబాలకుఁ డింకను సింహశాబకమును బీడించుచుండుట చేఁ దాపసయువతులు తర్జించుచు ,,బాలకా! ఈజంతువుల నన్నిఁటిని మేము మాబిడ్డలనలెఁ బెంచుకొనుచున్నాము! నీవకారణముగ దీని నేల బాధించెదవు? మామాట విని నీవించుక శాంతించి యాసింగపుఁబిల్లను మాకిచ్చి నీతల్లియొద్దకుఁ బోయి యాడుకొనుము! నీవు దీనిని విడువకున్నచో దీనితల్లి వచ్చి నిన్ను బాధింపఁగలదు" అని బెదరించిరి.

బాలకుఁ డించుకంతయును భయపడక దానిని మఱింత పీడింప నారంభించెను. అంతఁ దాపసస్త్రీలు ,,వీఁడు మాటలచేఁ మఱపింపఁదగిన పిల్లవాఁడు కాఁడు. మఱియొకయాశ పెట్టి యాతని మరలింపవలయును" అని యాలోచించి ,, వత్సా! నీవీసింగపుఁబిల్లను వదలితివేని మేము నీవాడుకొనుటకు మంచి వస్తువు నిచ్చెదము" అని బుజ్జగించి చెప్పిరి.

రాజా వేడుకను జూచుచుఁ గ్రమక్రమముగా వారికతి సమీపముగఁ బోయియు నాకస్మికముగ నెదుటఁబడుట మంచిది కాదని యెంచి యొకవృక్షాంతరాళమున దాఁగియుండి ప్రేమమయదృష్టులతో నాబాలకునిఁ దిలకించుచుండెను. అప్పుడా బాలకుఁడు తాపసస్త్రీలవంకఁ జేయి సాచి ,, ఏదీ! మీరిచ్చెదనన్న దేదియో తెండు!" అనియెను.

రాజా బాలకుని దక్షిణహస్తమును బరీక్షించి చమత్కృతుఁడై ,,ఆహా! ఏమియీవింత! ఈబాలునిహస్తము చక్రవర్తి

లక్షణాలక్షితమై యున్నదే!'' అని యాశ్చర్యపడియెను. నిజముగాఁ దాపసయువతులయొద్ద నాటవస్తువేదియును లేదు. వారు తత్క్షణమే యీయకుండుటంజూచి బాలకుఁడు కోపగించుకొని ''మీరిచ్చెద నన్నది యీయలేదు. కావున నేను దీనిని విడువను" అనియెను. అప్పుడొకతపస్విని రెండవయామెం జూచి ''సఖీ! వీఁడూరక లొంగువాఁడు కాఁడు! నీవు కుటీరమునకుఁ బోయి నెమిలిబొమ్మను వేగముగఁ దీసికొనిరమ్ము!'' అని చెప్పెను. ఆమె వెడలిపోయెను.

రాజుహృదయము క్రమక్రమముగాఁ బ్రేమరసముచే నిండిపోవుచుండెను. అప్పు డాతఁడు తనలో ''ఈబాలకు నెట్లయిన నుత్సంగమునం జేర్చుకొనవలయునని నాకింతకుతూహలము కలుగుచున్న దేమి? ఇతరబాలకుల నిదివఱ కెందఱినో చూచితిని గాని నాకెన్నఁడు నింతటిప్రేమోదయము కాలేదు! ఆహా! అదృష్టవంతుఁడగు నీబాలకునితండ్రి యీతని నొడిలోఁ జేర్చుకొని మనసార ముద్దులుపెట్టుకొనునుగదా! నవ్వుచున్నప్పు డీముద్దుబిడ్డపెదవుల నడుమనుండి సగముసగముగ సగపడుచుండు పాలపండ్లంగాంచి సంతోషించునుగదా! తేనెలొలుకుచుండు నీపాపనితీయనితొక్కుపలుకుల నాలకించి బ్రహ్మానందము ననుభవించునుగదా! అప్పుడాధన్యజీవనమున కెంతటియనిర్వచనీయప్రేమరసోదయమగునో! అయ్యో! నేను నిర్భాగ్యుఁడనైపోయితిని. జన్మమెత్తినందుకుఁ గావలసినసుఖము నాకు లభియిం

చినది కాదు. ఈజన్మమునందిఁక నాకట్టియాశ లేదు. నాయాశా లత నిర్మూలమైపోయినది." అని విచారించుచుండెను.

మృణ్మయమయూరమును దెచ్చియిచ్చుట కించుకయాలస్యమగుటచే బాలకుఁడు కుపితుఁడై సింగపుఁబిల్లను బలవంతముగ నాకర్షించి బాధింపసాగెను. తాపసయువతి యెంతప్రయత్నించినను నాతని మరలింపఁజాలక విసిగికొనుచు నెవ్వరైన సమీపమున మునికుమారులున్నచో వారీతని వదలింపఁ గలుగుదురని యెంచి నలువంకలఁ దిలకించుచు రాజుంగాంచి "అయ్యా! దయయుంచి మీరీసింహశాబకము నీబాలకుని చేతులనుండి విడిపించెదరా?" అనియెను.

ఆబాలకుఁడు మునికుమారుఁడని భావించి రాజు "ఓ ఋషితనయా! తపోవనధర్మమునకు విరుద్ధముగ నీవేల ప్రవర్తించెదవు?" అనియెను.

తాప—అయ్యా! ఈతఁడు మునికుమారుఁడు కాఁడు!

రాజు—ఈబాలకుని యాకారచేష్టితములంబట్టి నేనట్లే యెఱుఁగకొంటిని గాని తపోవనమున మునిబాలకులుగాక మఱియెవ్వరుందురని నేనీవిధముగ నిశ్చయించుకొంటిని.

అని రాజాబాలకునిచేయి పట్టుకొని యాసింగపుఁబిల్లను విడిపించి స్పర్శసుఖము ననుభవించుచు "ఇతరులబిడ్డయగు నీతనిస్పృశించి నేనే యింతటియానందముం గాంచుచుండఁగా నీ

తనివెంద్రి యీతనిస్పర్శసుఖముచే నెంతటియానంద మనుభవిం చునోగదా!" అనుకొనియెను.

స్వభావముచేతనే కుపితుఁడగు నాబాలకుఁడప్పుడు రాజు నెదుట శాంతముతో నిలుచుటయును, నాయిరువురి యాకృతు లను సామ్యలక్షణము లనేకము లగపడుచుండుటను గాంచి తాపసస్త్రీలు విస్మయాక్రాంత హృదయలై పోయిరి. ఆబా లుఁడు రాజకుమారుఁడని భావించి రాజు తాపసింగాంచి "ఈ తఁడు మునికుమారుఁడు గాకున్నచో క్షత్రియకుమారుఁడు గావలయును. అట్లే నిశ్చయమైనయెడల నేయంశమున జన్మించి నవాఁడో తెలిసికొనఁ గోరుచున్నాను" అనియెను.

తాప—ఈబాలుఁడు పురువంశజుఁడు!

రాజాకస్మికముగ నామాట నాలించి "నేనుజనించిన వంశమునందే యీతఁడును జనియించినాఁడు. పురువంశజులపద్ధతి యిట్టిదేగదా! వారు మొదట సాంసారికసుఖభోగముల ననుభ వించి తుదకు వారు సపత్నీకులై యరణ్యావాసము నాశ్రయిం తురు." అని యనుకొని యాతాపసి నుద్దేశించి "ఇది దేవ భూమి—మనుష్యులు సంచరించునది కాదు. అట్టిచో నీబాల కుఁ డిచ్చటి కెట్లు వచ్చినాఁడు ?" అని ప్రశ్నించెను.

తాప—ఈతనితల్లి యొకయప్సరసతోఁ గలసి యిచ్చ టకు వచ్చి యీయాశ్రమమునందే యీతని బ్రసవించినది.

రాజువిని తనలో "పురువంశము—అప్సరస్సంబంధ

ము—ఈ రెండుసంగతులునుగూడ మరల నాకాశను గల్పించు చున్నవి. కానిమ్ము! ఈతనితండ్రి యెవ్వరో యడిగి తెలిసికొని యెదను. అందువలన నెల్లసంశయములును వదలిపోవును.” అని యూహించుకొని ,,అమ్మా! ఈబాలకునితండ్రి యెవ్వరో నీ వెఱుంగుదువా!” అని ప్రశ్నించెను. అంతఁ దాపసి ,, మహో రాజా! ధర్మపత్నిని బరిత్యజించిన యాపాపాత్ముని నామోచ్చా రణము నెవ్వరుచేయుదురు?” అనియెను.

రాజు తనలో ,,ఇదియును నాహృదయమునకే తాఁకు చున్నది. కానిమ్ము! ఈతనితల్లిపే రడిగి చూచెదను. కాని పర స్త్రీవిషయమునఁ బ్రశ్నించుట యధర్మము కాదా! నేను మూ ఢుఁడనై నాయాశాలతను జేతులారఁ ద్రెంచివైచుకొంటిని. అట్లె నేను మరల దానిని జిగురింపఁజేయుటకై వృథాప్రయత్నము చేయుటవలన నేమిలాభము!” అని యీవిధముగా నాందోళన ముపడుచుండఁగా రెండవతాపసి కుటీరమునుండి మృణ్మయము యూరమును దెచ్చి ,,ఆహో! యేమి యీశకుంతలావణ్యము!” అనియెను.

ఆవాక్యమున శకుంతలాశబ్దము నాకర్ణించి బాలకుఁడు ,,ఏదీ మాయమ్మయేదీ?” అని ప్రశ్నించెను.

తాప—లేదునాయనా! మీయమ్మ యిచ్చటికి రా లేదు! నేనీపక్షిసౌందర్యముం గూర్చి యిట్లంటిని!

అని యామె రాజుం గాంచి ఓమహాపురుషా! ఈబా

లుఁడు పుట్టినదిమొదలు తల్లినిదక్క " ఇతరుల నెప్వరి నెఱుఁగఁ డు. ఎల్లప్పుడు నీతఁడు తల్లిచెంతనే యుండుటచేఁ గేవలము మాతృవత్సలుఁడై యున్నాఁడు! శకుంతలావణ్యశబ్దమునఁ దల్లి నామాక్షరములుండుటచే నీతనికిఁ దల్లిమాట స్మృతికి వచ్చి నది. ఈతని తల్లిపేరు శకుంతల!" అనియెను.

ఆమాటలను విని రాజు తనలో " ఈబాలకునితల్లి శకుంతలయా? ఎంతయాశ్చర్యము! క్రమక్రమముగా నన్ని సంగతులును స్పష్టముగాఁ దెలియవచ్చినవి. ఇంకను నేనాశ పడఁగూడదా? ఏమో! నేను మృగతృష్ణికాభ్రాంతుఁడనై నామసాదృశ్యముచేతనే యింతగా మనసులో వృథాందోళనము పడుచున్నాను. ఇట్టిపేరుగలవా రీప్రపంచమునం దెందఱుం డరు?" అని వితర్కించుకొనుచుండెను.

శకుంతల చాలసేపటినుండి తనయుని విడిచి యున్నది. ఆమె యొకనిమిషమైనఁ బుత్త్రుని విడిచి యుండఁజాలదు. అందు చే నామె యాశ్రమమున వెదకుకొనుచు నాకస్మికముగ నచ్చ టికి వచ్చెను. విరహాకృశాంగియు, మలినవేషయు నగు శకుంత లను రాజాకస్మికముగఁ గాంచి విస్మయాపన్నహృదయుఁడై యనేకదృష్టితో నామెవంకనే నిరీక్షించుచుండెను. అతని కనుద మ్ములశ్రుధారాపూరితములై పోయెను. అతఁడట్లే శిలావిగ్రహ మువలె నిలువఁబడిపోయెను. ఏమియుమాటాడఁజాలకపోయెను.

శకుంతలయు నాకస్మికముగఁ బ్రాణేశ్వరుం గాంచి య

దియుంతయు స్వప్నమేమో యను భ్రాంతితో స్థిరనయనయై యాతనివంకఁ జూచుచుండెను. ఆమె కన్నులనుండియును బాష్పధారలు ప్రవహించుచుండెను. బాలకుఁడు తల్లిని జూచినంత మాత్రముననే యొక్కపరుగున నామెయొద్దకువచ్చి ,, అమ్మా ! ఈతఁ డెవ్వరు ? ఈతనిం జూచి నీవిట్లు దుఃఖించుచుంటివేమి?'' అనియడిగెను. అప్పుడు శకుంతల గద్గదస్వరముతో ,,నాయనా! ఈమాట నన్నడిగెదవేల ? నీయదృష్టము నడుగుము!'' అనెను.

కొలఁదిసేపటికి రాజు తనహృదయావేగము నుపశమింపఁ జేసికొని శకుంతలంగాంచి ,, హృదయేశ్వరీ ! నేను నీయెడలం గావించిన దుర్వ్యవహారము వాక్కులతో నుచ్చరింపఁదగినది కాదు. ఏమోకాని యప్పుడు నాకు మతిపోయినది. అందు చేతనే నేను నిన్నవమానించి పరిత్యజించితిని. అది మొదలుగ నేనెంతటికష్టముతోఁ గాలము గడుపుచుంటినో నాయంతరాత్మకే యెఱుక ! మరల నాకు నీదర్శనము లభించునను నాశయే లేదు. ఇప్పుడు నీవు నీయవమానదుఃఖమును మఱచిపోయి నా యపరాధమును క్షమింపుము ! " అని పలుకుచు రాజు మూలచ్ఛిన్నకుసతరున్యాయమున భూతలపతితుఁడై పోయెను. శకుంతల తత్తఱముతో నాతని బడకుండఁ బట్టుకొని ,, ఆర్యపుత్రా! లెమ్ము ! లెమ్ము ! ఇందు నీదోష మేమున్నది ? అంతయు నా యదృష్టదోషము ! ఇంతకాలమునకైన నేను నీకు జ్ఞప్తికివచ్చితిని. ఇప్పుడింక నా సకలదుఃఖములును దూరములై పోయినవి.''

అని పలుకుచుండఁగా శకుంతల కనుదమ్ములనుండి బాష్పధారలు ప్రవహించిపోవుచుండెను.

మహారాజు లేచి బాష్పపూరితనయనములతో ,, ప్రాణేశ్వరీ ! నేను నిన్నా సభలో నవమానించినప్పుడు నీకన్నులు దుఃఖాశ్రుధారాపూరితము లైపోయినవి. వానిని గన్నులారఁ జూచియు నప్పుడు నేను నిర్దయుఁడనై యుపేక్షించితిని. తరువాత నన్నా దుఃఖమే కలఁచివైచి నాహృదయమును దహించివైచినది. ఇప్పుడు నీకన్నీరు దుడిచి నా సకలదుఃఖములను వదలించుకొందును. ” అని చెప్పుచు స్వహస్తములతో శకుంతల కన్నీటిం దుడిచివైచెను. అందుచే శకుంతల శోకసాగరము మఱింత యుప్పొంగిపోయెను. బాష్పధారలు ద్విగుణీకృతములై ప్రవహింప నారంభించెను.

కొంతసేపటికి శకుంతల దుఃఖావేగము నడంచుకొని ,, ఆర్యపుత్రా! నన్ను మీరు మరలఁదలఁచుకొందురనునాశ నాకెంతమాత్రమును లేనేలేదు. అప్పు డెన్నివిధముల భోధించినను దెలిసికొనఁజాలనిమీకుఁ దరువాత నేనెట్లు జ్ఞప్తికి వచ్చితిని?” అనియెను.

రాజు—ప్రాణప్రియా! ఆనాఁడు నీవు నాకానవాలుగ నుంగరమును జూపింపవలయునని ప్రయత్నించితివి. అది నీయొద్ద లేకపోయెను. కొంతకాలమునకది యొకకారణముచే నాచేతులఁ బడినది. తోడనే సమస్తవృత్తాంతమును నాకు జ్ఞప్తి

వచ్చినది. అయుంగరమిదిగో!

అని రాజు తనవ్రేలి యుంగరముం దీసి శకుంతలవ్రేలి కలంకరింపఁబోయెను. అప్పుడు శకుంతల ''ప్రాణేశ్వరా! ఇఁక నాకీయుంగరముతోఁ బనిలేదు. ఇది మీయంగుళి నెడఁబాసి వచ్చి నాకు మహాదుఃఖముం గల్పించినది. కావున దీని నెప్పటి వలె మీయొద్దనే యుండనిండు!'' అనియెను.

ఇట్లు వారిరువురు సంభాషించుకొనుచుండఁగా మాతలి యచ్చటికివచ్చి వారింగాంచి యానందవికసితవదనకమలుఁడై ''మహారాజా! ఇన్నాళ్ళకు నీకు నీధర్మపత్నీసమాగమము లభించినది. ఇందువలన నాకిప్పుడపారానందము కలుగుచున్నది. భగవానుఁడగు కశ్యపుఁడీవార్తనాలించి పరమానందభరితుఁడు కాఁగలఁడు. ఇప్పుడే మనమామహాత్ముని దర్శింపఁబోవుదము! అతఁడు మీరాకకొఱకుఁ బ్రతీక్షించుచున్నాఁడు!'' అనియెను.

అప్పుడు రాజు శకుంతలం గాంచి ''ప్రియా! నడువుము! ఇప్పుడు మనమిరువురము గలిసిపోయి భగవానుఁడగు కశ్యపుని పూజ్యపాదసందర్శనముం గావింతము.'' అనియెను.

శకుం—ఆర్యపుత్రా! క్షమింపుము! నేను మీతోఁ గలసి పెద్దలను సందర్శింపఁజాలను. నాకుఁజాల సిగ్గుగనుండును.

రాజు—ప్రాణేశ్వరీ! శుభసమయములయందు సతీపతులేకీభవించి, గురుజనసందర్శనముం గావించుట మాన్యము. కావున నడువుము! ఆలస్యము చేయవలదు.

తృతీయదృశ్యము — ఆశీర్వాదము

రాజు శకుంతలను వెంటఁబెట్టుకొని మాతలితోఁ గలసి పోయి కశ్యపాశ్రమమునఁ బ్రవేశించెను. అప్పుడు భగవానుఁడగు కశ్యపుఁడు దేవియగునదితితోఁ గలసి యేకాసనమునఁ గూర్చుండి యుండెను. తోడనే రాజు భార్యాసహితుఁడై యాపూజ్యదంపతుల పాదపీఠమున కెదురుగ సాష్టాంగనమస్కారముం గావించి చేతులుజోడించుకొని వారియెదుట నిలువఁబడియెను. అప్పుడు కశ్యపమహర్షి "వత్సా! చిరంజీవివై యప్రతిహతప్రభావముచే నీయఖండభూమండలమున కేకచ్ఛత్రాధిపతివగుము!" అని యాశీర్వదించి శకుంతలంగాంచి "అమ్మా! నీనాథుఁడు మహేంద్రసమానుఁడు! నిన్నింకను నేమని యాశీర్వదింపవలయును? నీవు శచీసదృశురాలవగుము!" అని దీవించి యిరువురను గూర్చుండుఁడనియెను.

అందఱును గూరుచుండిరి. అప్పుడు రాజు కృతాంజలియై వినయవచనములతో "మహాత్మా! ఈశకుంతల విూసగోత్రజుఁడగు కణ్వమహామునికిఁ బెంపుడుకూఁతురు. నేను వేఁటకుఁ బోయినప్పు డామహర్షి తపోవనమున లేడు. ఆటిసితిలోఁ బెద్దలయనుమతి లేకుండఁగనే నేనీమెను గాంధర్వవిధానమునఁ బెండ్లియాడితిని. తరువాత నీమె మహర్షిచే రాజధానికిఁ బంపఁబడినది. అప్పుడు నేనీమె నానవాలే పట్టఁజాలకపోయితిని. అంతటివిస్మృతి నాకుఁ గలుగుటచే నేను మూఢునిం బోలి

సభాస్థానమునం దీమె నవమానించితిని. ఆకారణముచే నేను మీయెడలను మీవంశజుఁడగు కణ్వమహర్షి యెడలను మహాపచారము గావించినవాఁడ నైతిని. మీరు పరిపూర్ణానుగ్రహముంచి నాయపరాధమును మన్నించి మహాత్ముఁడగు కణ్వునకు నాయెడలఁ గ్రోధము కలుగకుండునట్టి యుపాయమును గటాక్షింపవలయును" అని ప్రార్థించెను.

కశ్యపుఁడాతని విన్నపమునాలకించి మందహాసము చేయుచు "వత్సా! నీవీవిషయమునఁ బరితాపముం బొందవలదు. ఇందు నీయపరాధ మణుమాత్రమును లేదు. నీకంతగా స్మృతి లేకుండఁ బోవుటకుఁ గారణము నీవుగాని శకుంతలగాని యెఱుఁగని రెఱుఁగరు. అట్లు జ్ఞప్తి లేకపోవుటకుఁ గారణమును నేను చెప్పెదను వినుము! విన్నచో శకుంతలకుఁగూడ నవమానదుఃఖము దూరమైపోఁగలదు! అమ్మా! శకుంతలా! ఈమహారాజు తపోవనమును విడిచి రాజధానికిఁ బోయినతరువాత నొకనాఁడు నీవు పతిధ్యాననిమగ్నవై కుటీరమునఁ గూర్చుండియుండఁగా దూర్వాసమహర్షి యతిథియై యచ్చటికి వచ్చెను. నీవప్పుడు బాహ్యజ్ఞానశూన్యురాలవై యుండుటచే నాతనిని సత్కరింపఁ జాలకపోయితివి! అందుచే నాతఁడు కుపితుఁడై "నీవెవ్వని ధ్యానించుచు నితరమును మఱచి యతిథినగు నన్నవమానించితివో ఆధ్యానగమ్యుఁడగు నాతఁడు కేవలము నిన్ను మఱచి పోవునుగాక!" అని శపించెను. నీవాశాపమును వినలేదు. నీసఖు

లా శాపమును విని యాతనిపాదములపైఁబడి యనేకవిధములఁ బ్రార్థించుటచే నాతఁడు ప్రసన్నుఁడై "ఈశాపము నిరర్థకము కాఁజాలదు. కాని యాతఁడు మీ చెలికిచ్చిన యాభరణమేదైన నున్నయెడల దానిం జూపినంతనే యాతని కెల్లసంగతులును జ్ఞప్తికి రాఁగలవు" అని శాపమోక్షణముం బ్రసాదించినాఁడు. ఈవిస్మృతికిఁ గారణ మదియే కాని వేఱుకాదు. అందుచేతనే యంగుళీయకదర్శనమాత్రమున నీపతికంతయును స్మృతికి వచ్చినది." అని చెప్పెను.

దూర్వాసశాపవృత్తాంతము నాలకించి దుష్యంతుఁ డతి సంతోషముతో "మహాత్మా! నేనిప్పు డందఱియెదుటను నాసకలాపరాధములనుండియు విముక్తుఁడ నైతిని." అనియెను.

శకుంతల తనలో "ఇందువలననే నాకింతటి దుర్దశ కలిగినది. కాకున్నచో నింతటిసరళహృదయుఁడగు ప్రాణేశ్వరుఁడు నన్ను కారణముగఁ గఠినహృదయుఁడై పరిత్యజించునా? నాకష్టమునకు దూర్వాసశాపమే మూలకారణము! అందుచేతనే తపోవనము నుండి నేనురాజధానికి బయలుదేరు సమయమునందనసూయాప్రియంవద లాయుంగరముంగూర్చి ప్రయత్నపూర్వకముగ నాకుఁ దెలిపియున్నారు. అదృష్టవశమున నిప్పటికైన నాకీవృత్తాంతము తెలిసినది. లేకయున్నచో నేను బ్రదికియున్నంతవఱకును నార్యపుత్రుఁడు నన్నకారణముగఁ బరిత్యజించెనని మనసులో క్షోభ పడుచునే యుండుదును" అనియనుకొనియెను.

తరువాతఁ గశ్యపమహర్షి రాజుంగాంచి ,,వత్సా!నీయీ కుమారుఁడు చతుస్సముద్రముద్రితధరామండలమున కద్వితీయాధికారియై సకలభువనభర్తయై భరతుఁడను నామముచే సుప్రసిద్ధుఁడగును.'' అనియెను. ఆమాట విని రాజు మహాత్మా! మీరు సంస్కరించిన యీబాలకున కిట్టి యదృష్టము పట్టుట కభ్యంతర మేమున్నది?''అనియెను. అప్పు డతఁడు,,అతిశీఘ్రముగఁ గణ్వునకును మేనకకు నీశుభసమాచారమును దెలియఁజేయవలయును'' అని చెప్పెను.

తోడనే కశ్యపుఁ డిరువురుశిష్యులను గణ్వునకును మేనకకును దెలియఁజేయుటకై పంపించెను. తరువాతనాతఁడు రాజునుద్దేశించి ,,వత్సా! నీవు రాజధాని వదలి చాలదినములై యుండును. కావున శీఘ్రముగ దేవరథమునారోహించి పత్నీపుత్రసహితుఁడవై బయలుదేఱుము!'' అని చెప్పెను.

అప్పుడు రాజు చిత్తమని నమస్కరించి సెలవుగైకొని ప్రదక్షిణపూర్వకముగఁ బత్నీపుత్రసహితుఁడై రథారోహణముఁ గావించి నిజరాజధానికి వెడలిపోయి పరమానందముతో రాజ్యమును బ్రజలను ధర్మమార్గమునఁ బరిపాలించుచు సుఖంబుండెను.

